# అభినందన చంద్రిక



## సాహితీప్రియులు, శాసనసభ్యులు
## డాక్టరు కాసరనేని సదాశివరావు గారు

– కొల్లా శ్రీకృష్ణారావు

# అభినందన చంద్రిక

సాహితీప్రియులు, శాసనసభ్యులు

డాక్టరు కాసరనేని సదాశివరావుగారి

షష్ట్యబ్ద పూర్తి సన్మాన సంచిక

23-3-1986

ఈ పుస్తకము : సదాశివరావు శతజయంతి. 13 అక్టోబర్ 2023

PSSR : 9441065414

Gmail : Peddissrgnt@gmail.com

**సంకలనము:**

**కొల్లా శ్రీకృష్ణారావు**

# విషయసూచి:



## సందేశాలు

**భాగం – 1**


| | | పేజీ నెం. |
|---|---|---|
| నందమూరి తారకరామారావు | రాష్ట్ర ముఖ్యమంత్రి | 7 |
| ఆచార్య రంగా | | 8 |
| ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తి | | 9 |
| గాలి ముద్దు కృష్ణమనాయుడు | విద్యాశాఖామాత్యులు | 10 |
| డాక్టర్ సి.నారాయణరెడ్డి | | 11 |
| డా.బి.సర్వేశ్వరరావు, ప్రొఫెసర్ | | 11 |
| డాక్టర్ యం.యస్.యస్. కోటేశ్వరరావు | వైద్య, ఆరోగ్యశాఖామాత్యులు | 12 |
| ప్రొఫెసర్ యం.ఆర్. అప్పారావు | మాజీ వైస్ ఛాన్సలర్ | 13 |
| డా. డి. జగన్నాధరెడ్డి | | 15 |
| ఆభాషణము | కొల్లా శ్రీకృష్ణారావ | 17 |
| అభినందనం | ఆచార్య తూమాటి దోణప్ప | 18 |
| స్నేహశీలి | గౌతు లచ్చన్న | 19 |
| విద్యావేత్త | అమరేంద్ర | 20 |
| బహుదా | ఆవుల సాంబశివరావు | 22 |
| బహుముఖ ప్రజ్ఞాశాలి | భావరాజు నరసింహారావు | 24 |
| సాహిత్యాభిమాని | డాక్టరి ఎస్. గంగప్ప | 29 |
| డాక్టర్ రావ్– వ్యక్తిత్వ విశ్లేషణ | డాక్టర్ సంజీవదేవ్ | 31 |

| | | |
|---|---|---|
| సన్మిత్రులు | బాలబంధు, బి.వి. నరసింహారావు | 33 |
| ఆదర్శజీవి | చిన్నము రామయ్య చౌదరి | 35 |
| డాక్టరు గారితో నా పరిచయం | పాతూరి కోటేశ్వరరావు | 37 |
| మా గురుదేవులు | డా.యస్.కె. హరనాథబాబురెడ్డి | 38 |
| మా డాక్టరు గారు | డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ | 39 |
| సౌజన్యమూర్తి | వేగుంట కనకరామబ్రహ్మం | 40 |
| మనీషి | పి.జగదీశ్వరరావు | 41 |
| తోడు – నీడ | జొన్నలగడ్డ రామారావు | 42 |
| నాకు తెలిసిన సదాశివరావుగారు | రాయపాటి వీరయ్య | 43 |
| విన్నాణికి జేజేలు | గొరిజవోలు పాండురంగారావు | 45 |
| సాహితీ పోషకులు | ఘంటా అప్పయ్య | 46 |
| విశిష్ట వ్యక్తి | డాక్టర్ ముద్దన హనుమంతరావు | 47 |
| ఆదర్శ వైద్య దంపతులు | డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి | 48 |
| అక్షరాకాంక్షలు | పి. అచ్యుతరామ్ | 49 |
| రైతుబిడ్డ | రానేని శివరామయ్య | 49 |
| మై మాష్టర్ | డాక్టర్ జక్కంపూడి సీతారామరావు | 50 |
| అమృతహస్తుడు | పెనుమచ్చ శంకరరావు | 51 |
| వైద్యనిపుణులు | గుంటుపల్లి నాగేశ్వరరావు | 52 |
| మహోన్నత వ్యక్తి | కిలారి రాజన్ బాబు | 53 |
| కల్యాణ తోరణము | సమీక్ష | 56 |
| నీరాజనము | వసంత శాయికృష్ణ ప్రసాద్ | 57 |
| కృతజ్ఞతలు – ‘నమస్తే’ | డాక్టర్ కాసరనేని సదాశివరావు | 58 |

# భాగం –2


| | | |
|---|---|---|
| దీవెనలు | | 63 |
| భద్రంతే | | 64 |
| శుభపరంపరలు | –"కళా ప్రపూర్ణ" కొసరాజు రాఘవయ్య చౌదరి | 65 |
| సదాశివమ్ | – అబ్బరాజు శ్రీనివాసమూర్తి | 66 |
| ఎలా?! | – రావెల సాంబశివరావు | 67 |
| మహతి | – బండ్లమూడి సత్యనారాయణ | 68 |
| స్వాకాంక్ష | – డాక్టరు బేతవోలు రామబ్రహ్మం | 69 |
| అభినందన మాలిక | – చలసాని ఉషారాణి | 71 |
| భువనమాల | – సుఖవాసి మల్లికార్జునరాయశాస్త్రి | 71 |
| ప్రశంస! | – యం. వి. ఆర్. కృష్ణ శర్మ | 72 |
| భిషగ్వరా! | – డాక్టర్ యం. పాండురంగారావు | 73 |
| ప్రశ్నోత్తరం | – డా. రావి రంగారావు | 74 |
| జాతిరత్నము | – శ్రీ బొద్దులూరు నారాయణరావు | 74 |
| సన్మానపద్య ప్రసూనాంజలి | – శ్రీ చిన్నము రామయ్య చౌదరి | 76 |
| సదాశివాష్టకము | – డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ | 76 |
| త్రీచీర్స్ | – నాగభైరవ కోటేశ్వరరావు | 77 |
| దేశికోత్తముడు | – కీ॥ శే॥ చలసాని లక్ష్మీనారాయణవర్మ | 78 |
| సన్మిత్రులు | – శ్రీ బొద్దులూరు నారాయణరావు | 78 |




"అభినందన చంద్రిక" పుస్తకమును ఆడియో వినటం కొరకు పై కనిపిస్తున్న QR code ను మీ ఫోనులో 'గూగుల్ లెన్స్' లో ఫోటో తీస్తే , లింక్ కనిపిస్తుంది. దానిపై క్లిక్ చేసినచో మీరు ఈ పుస్తకమును ఆడియో రూపంలో వీనుల విందుగా వినవచ్చు.

సమయం : 3 గంటలు




డాక్టర్ సదాశివరావు గారి మాటలు ఆడియో వినటం కొరకు పై కనిపిస్తున్న QR code ను మీ ఫోనులో 'గూగుల్ లెన్స్' లో ఫోటో తీస్తే , లింక్ కనిపిస్తుంది. దానిపై క్లిక్ చేసినచో మీరు ఈ పుస్తకమును ఆడియో రూపంలో వీనుల విందుగా వినవచ్చు.

సమయం : 40 నిమిషాలు

# సందేశాలు

## నందమూరి తారక రామారావు, ముఖ్యమంత్రి



డాక్టరు సదాశివరావు గారూ,

మీరు 60 సంవత్సరాల సంపూర్ణ, విజయవంతమైన జీవితాన్ని పూర్తి చేసుకున్నందుకు నా హృదయపూర్వక అభినందనలు. ఈ రోజు మీకు చాలా సంతోషకరమైనది. ఇటువంటి రోజులు మరెన్నో రావాలని కోరుకుంటున్నాను. మీకు, మీ శ్రీమతి గారికి, మీ కుటుంబ సభ్యులకు ఆయురారోగ్యాలను, అన్ని శుభాలను, శ్రేయస్సును ప్రసాదించాలని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను. షష్టిపూర్తి ఉత్సవం మహోత్సవంగా విజయవంతం కావాలని కోరుకుంటున్నాను. ★

## Prof. N. G. Ranga,

## ఆచార్య యన్. జి. రంగ, పార్లమెంటు సభ్యులు



డాక్టరు సదాశివరావు గారి షష్ట్యబ్ది పూర్తి వుత్సవం సాగిస్తున్నందులకు సంతోషం.

డాక్టరు సదాశివరావు ప్రఖ్యాతి గాంచిన వైద్యులు. గుంటూరు గవర్నమెంటు హాస్పటల్ ఆనరరీ సర్జన్ గా, మెడికల్ కాలేజి ఆనరరీ ప్రొఫెసరుగా, మంచి వైద్యులుగా, ఉత్తమ ఉపాధ్యాయులుగా పేరు సంపాదించారు. వారి అమూల్యమైన సమయాన్ని సాంఘిక, సాహిత్య కార్యక్రమాలకు వినియోగిస్తున్నారు. సాహితీ సదస్సు ద్వారా కవులను, పండితులను, రచయితలను ప్రోత్సహిస్తూ అనేక గ్రంథాలను వెలుగులోనికి తెచ్చారు. జాగర్లమూడి కుప్పుస్వామి చౌదం కాలేజిని స్థాపించటంలో, దానిని అభివృద్ధికి తెచ్చుటలో కృషి ఎంతో చేశారు.

1980 సం॥ లో నాపై ప్రత్యర్థిగా రాజకీయ విభేదాలవల్ల నిలిచిరి. నేను ఎన్నికైన పిమ్మట, వెనుకటి వలెనె సహృదయులై నన్ను కలసి, గౌరవప్రదంగా పూర్వమైత్రిని అందుకోగల్గిన యోగ్యులు. వారికి, వారి భార్య డాక్టరు జయప్రదాంబకు నా శుభాశీస్సులను అందించండి.



ప్రేమతో,
రంగ

# ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తి,



నాగార్జున యూనివర్సిటీ చైర్మన్, ఇండియన్ ఫిలాసఫికల్ కాంగ్రెస్ నేషనల్ ఫెలో, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ ఫిలాసఫికల్ రీసెర్చ్.

డా.కె.సదాశివరావు గారి అరవయ్యవ జయంతి వేడుకలు జరుపుకోబోతున్నారని తెలిసి సంతోషించాను. కొన్నేళ్లుగా డాక్టర్ రావు గుంటూరుకు చెందిన ప్రముఖ జనరల్ సర్జన్‌గా స్థిరపడ్డారు. తన క్లినిక్‌కి వచ్చే విద్యార్థులు, తన స్నేహితులు, సాహితీవేత్తలు, పేదలను వారి నుండి ఎటువంటి రుసుము వసూలు చేయకుండా పరీక్షించడం, రోగనిర్ధారణ చేయడం, ప్రిస్క్రిప్షన్ ఇవ్వడం జరుగుతుంది. నిస్సందేహంగా గుంటూరులో అత్యంత ప్రజాదరణ పొందిన సాధారణ వైద్యులలో ఆయన ఒకరు. బాధలను తగ్గించే తన వృత్తిలో, భర్త ప్రజా కార్యకలాపాలలో డాక్టర్ జయప్రదాంబ వారికి విలువైన మద్దతునిస్తుంది.

దాదాపు రెండు దశాబ్దాలుగా క్రియాశీల రాజకీయాలపై ఆసక్తి ఉన్న ఆయన ఈ జిల్లాలోని కొన్ని నియోజకవర్గాల్లో ప్రజల సంక్షేమం కోసం కృషి చేశారు. ఎట్టకేలకు ఇటీవల శాసనసభ్యుడిగా ఎన్నిక కాగా, ఆయనకు తగిన ప్రతిఫలం దక్కింది. భావసారూప్యత గల వారి స్నేహితుల తోడ్పాటుతో ఆయన ఒక కళాశాలను స్థాపించారు, అది ఇప్పుడు ఆంధ్రాలోని ఈ విభాగపు అత్యుత్తమ సంస్థల్లో ఒకటి. తన సమయాన్ని, శక్తిని చాలా ఖర్చు చేశారు. వారు కొన్ని సంవత్సరాల పాటు క్రమం తప్పకుండా నెలవారీగా జరిగే సాహిత్య వేదికను ప్రారంభించి, కొనసాగించారు. కవులు, పండితులు కలుసుకోవడానికి, ఆదర్శాలను మార్పిడి చేసుకోవడానికి అవకాశాలను అందించారు.

నాలాంటి స్నేహితులు ఆయన సామర్థ్యాలు, అనుభవాన్ని రాష్ట్రప్రభుత్వం సాధ్యమైనంత గరిష్టంగా ఉపయోగించుకోవాలని ఎదురు చూస్తున్నారు. ఆయనకు దీర్ఘాయుష్షు, సంతోషం, వేడుకలు అన్నీ విజయవంతం కావాలని కోరుకుంటున్నాను. ★

కె. సచ్చిదానంద మూర్తి

# గౌ. గాలి ముద్దు కృష్ణమనాయుడు, విద్యాశాఖామాత్యులు




గుంటూరు పురప్రముఖులు, శ్రేయోభిలాషులు డాక్టర్ కాసరనేని సదాశివరావుగార్కి పెద్దఎత్తున షష్టి పూర్తి మహోత్సవము జరుపుటకు సంకల్పించి, ఆ మహోత్సవ వేడుకను చిరస్మరణీయముగా నుండుటకుగాను ఒక "అభినందన సంచిక"ను ప్రచురించుచున్నందుకు నేను చాలా సంతోషించు చున్నాను.

సహృదయులు, సాహితీపోషకులు, వైద్యవృత్తిలో అందరి మన్ననలు పొంది, డాక్టర్ సదాశివరావు గారు రాజకీయ రంగములో ప్రవేశించి శాసనసభ్యుడుగా అటు పెదకూరపాడు నియోజకవర్గ ప్రజలకే కాక యిటు గుంటూరు జిల్లా ప్రజలకు యితోధికముగా సేవ చేయుచున్నారు. తన జీవితమును ప్రజాసేవకే అంకితము చేసిన సదాశివరావుగార్కి షష్టిపూర్తి మహోత్సవము జరుప తలపెట్టుట అభినందనీయము.

వారి సేవలు, గుంటూరుజిల్లా ప్రజలకే కాక యావదాంధ్ర రాష్ట్ర ప్రజలకు యుండగలవని ఆశించుచూ, "వారికి భగవంతుడు సదా ఆయురారోగ్య ఐశ్వర్యములు" ప్రసాదించుగాక అని కోరుకొనుచున్నాను.ఈ శుభ సందర్భములో నా "శుభాకాంక్షలు" తెలియజేయుచున్నాను. ★

భవదీయుడు,

జి. ముద్దుకృష్ణ మనాయుడు

## డాక్టర్ సి. నారాయణరెడ్డి, వైస్ ఛాన్సలర్, ఆం.ప్ర. సార్వత్రిక విశ్వవిద్యాలయం



డాక్టర్ సదాశివరావుగారి షష్టిపూర్తి మహోత్సవం జరుపుతున్నందుకు సంతోషం. డాక్టర్ సదాశివరావు గారితో నాకున్న పరిచయాన్ని బట్టి ఆయన విజ్ఞతను, రసజ్ఞతను అర్థం చేసుకోగలిగాను. డాక్టరుగారు వైద్య విద్యపట్ల చూపే ఆసక్తిని పద్యవిద్యపట్ల చూపడం ప్రశంసనీయం. సాహితీపోషకులైన డాక్టర్ సదాశివరావుగారి షష్టిపూర్తి సందర్భంలో ఆయనకు నా శుభాకాంక్షలు. ఉత్సవం జరుపుతున్న మీకు నా అభినందనలు. ★

సి. నారాయణరెడ్డి

## డాక్టర్ బి. సర్వేశ్వరరావు, డి.లిట్,

## అర్థశాస్త్ర విశిష్ట ఆచార్యులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం

Dr. Kasaraneni Sadasiva Rao's Shastiabda Purti Celebrations. I hope the Celebrations went off well in a worthy manner. Dr. Sadasiva Rao is a reputed surgeon and a Public worker committed and dedicated to good causes. Please convey my kindest regards and good wishes to him. ★

Dr. B. Sarveswara Rao

## డాక్టర్ యం. యస్. యస్. కోటేశ్వరరావు, గౌరవనీయ ఆం. ప్ర. వైద్య ఆరోగ్యశాఖామాత్యులు



I am extremely glad to note that Shastipurti Celebration of Dr. Kasaraneni Sadasiva Rao garu, M.L.A. Pedakurapadu, Guntur district is being organised on a large scale and indeed it is a very befitting occasion to bring out a special issue to honour him.

I know him very intimately as one of the very leading and Popular Medical Practitioners of the area respected by every family for his dedicated services. Dr. Rao is the Senior Medical Practitioner in the district, who established first Nursing Home with all facilties in Guntur. He has rendered yeoman services to the fellow brothern through his healing art. The services rendered by him in the rural areas are most commendable, which won the encomiums of one and all. Most of the Present-day leading practitioners in the district and many other parts of the State were trained by Dr. Rao who has all the gift endowed with humanitarian approach.

In spite of his roaring practice, he could find time to dedicate himself to serve the cause of the poor and the downtrodden Dr. Rao has the distinguished credit of having established many educational institutions in the district. Apart from his participation in social activities, he has been very actively associating himself in politics.

It is my ardent desire that Dr. Rao will continue to serve the people with renewed vigour. I pray Lord Almighty to shower his unlimited grace on Dr. Rao and family for their health and hapiness.

My very best wishes on the very auspicious occasion of his Shastipurti. ★

## ఆచార్య యం. ఆర్. అప్పారావు, పూర్వ శాసనసభ్యులు, పూర్వ పార్లమెంటు సభ్యులు



సదాశివరావుగారు నాకు చిరకాలమిత్రులు. వారు మానవ సేవయే మాధవసేవగా భావించి, ప్రజాసేనలో జీవితం గడుపుచున్నారు. సాహిత్య, సాంస్కృతిక, విద్యా, వైద్య తదితర రంగాలలో అపారమైన సేవ చేస్తున్నారు.

షష్ట్యబ్ది పూర్త్యుత్సవ సందర్భమున డాక్టరు సదాశివరావు గారికి, వారి సతీమణి శ్రీమతి జయప్రదాంబగారికి భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగ జేయుగాక. ★

# Dr. Sadasiva Rao –The Friend, Philosopher & Guide

Dr. D. JAGANATHA REDDY,M.D.




It is heartening to know that Shasti- abdipurthi celebration for Dr.K. SadasivaRao, M.S. is scheduled. This is an Occasion on for jubilation for the Citizens of Guntur and its neighbourhood. Dr. Sadasiva Rao has had a brilliant academic career and equally rewarding professional achievements. He is top ranking graduate of Andhra Medical College. Visakhapatnam and obtained Master of Surgery degree from the same college with merit in early fifties.

At that time very few could impress and enjoy the approbation of Dr. M. V Ramanamurthi who is reckoned to be just and fair and supported and encouraged able and competent Postgraduates. Drs. Lingam. Suryanarayana and Sadasiva Rao are his accredited assistants. Dr. Rao is quick to grasp, possessed of Eagle's Vision. He is equally quick in making a decision in Professional or domestic matters. As a postgraduate he manifested in an abundant measure the elements that make a surgeon- imperturbability while in troubled waters and successfully finish the operation effecting a cure. He is considerate and compassionate towards his patients.

At the time of upgrading of Guntur Medical College in June 1954 he and his wife Dr. Jayapradamba moved to Guntur from Visakhapatnam and set up Peoples Nursing Home with courage and confidence. At that time Dr. P. Veerisah Choudary had a Nursing Home. Within a short period, this illustrious couple established themselves and patients began to crowd the Nursing Home for care and cure.

With the opening of Clinical course of studies at Guntur Medical College, talent hunt was made to enlist able Clinicians as Consultants to Government General Hospital, Guntur. Drs. K. Sadasiva Rao, P.Venkateswara Rao and C.Sambasiva Ra were appointed as Honorary Surgeons and Physcian respectvely. They filled the much-needed void and demonstrated Professional skill and ethics to their pupils in a laudable manner.

Along with me Drs. Muniswamy Chetty, Kodandaramiah. Mrs. Rajeswari, G. Ethirajulu and Sobhanadri moved to Guntur Medical College. We and the group mentioned above as Pilgrim Fathers worked hard with Zeal for the development of Guntur Medical College. Dr. Sadasiva Rao showed the path to many ambitious doctors like Chigurupati Nageswara Rao, J. V. Krishna Rao and Basava Punniah and many others in setting up Nursing Homes in Guntur, Some of them worked with him.

Dr. Jayapradamba could take justifiable credit for the achievements of Dr. Rao in having ably and patiently supported him as an able Obstetrician as well as making an ideal home. In this Dr. Jayapradamba's mother was caretaker of their home who slogged with pleasure and pride, relieving them of the problems of house maintenance.

Dr. Rao is generous and Philanthrophic, in that he has made magnanimously contributions to all deserving causes. He has done a grand job as Secretary to J. K. C. College, Guntur.

Jayapradamba and Sadasiva Rao did well in bringing up their children on ideal lines and some of them joined them in Nursing Home.

People say as they walk or travel in their Car in the Main Raod "The Doctor Couple are going". This is sufficient Testimony, reward and recognition of their services. May God give them long life and happiness to serve the sick. ★

*"కాలాతీతమై పోతోంది, చెప్పవలసిన చెప్పదలచిన దానిలో*
*ఇప్పటికీ చెప్పినదొాక సహస్రాంశమైనా లేదు. ఏమిటి చేసేది నేను! "*

"ప్రతిదీ దైవనిర్ణయం అనే కంటే, కాలనిర్ణయం అంటే సముచితంగా ఉంటుంది.
ఎందుకంటే దైవం ఎక్కడ ఉన్నాడో మనకు తెలియదు. కాని కాలం మాత్రం మన కళ్ళముందు వుంది."

– మాలతీ చందూర్

## ఆభాషణము

– కొల్లా శ్రీకృష్ణారావు



డాక్టరు కాసరనేని సదాశివరావుగారు శస్త్రవైద్య నిపుణులు.. విద్యావేత్త, స్నేహశీలి. ప్రజాస్వామ్యవాది, వ్యక్తి స్వేచ్ఛాభిలాషి. హితభాషి. మితభాషి. స్వయంకృషితో అభివృద్ధిలోనికి వచ్చిన దొడ్డ మానిసి, ఆదర్శవివాహజీవితము వీరి సౌశీల్యము నినుమడింపజేసినది. "కర్షకకవి". శ్రీ చలసాని లక్ష్మీనారాయణవర్మగారి పుత్రిక డాక్టరు జయప్రదాంబగారు వీరి జీవిత భాగస్వామిని, ఈ దంపతులు ధనార్జనే లక్ష్యముగా గాక సేవాభావముతో "ప్రజావైద్యశాల" ను ప్రారంభించి వైద్యవృత్తిని కొనసాగించుచున్న దీనజన బాంధవులు.

బహు విషయములపై డాక్టరుగారికున్న పరిజ్ఞానమాశ్చర్యకరమైనది. సాహిత్యాధ్యయనముపట్ల ప్రగాఢమైన అభినివేశము గలిగించు వారి సంభాషణలో మధురమైన హాస్యముతోపాటు చెణుకులు తొణికిసలాడును. వారి వ్యాఖ్యలు ఆసక్తికరముగా, విజ్ఞాన దాయకముగా నుండును. భాషావిషయమున సంప్రదాయవాదులైనను నవీనమును నిరసించని సహృదయులు, సుప్రసిద్ధ ప్రాచీనాధునికాంధ్ర మహాకవుల కావ్యములలో అనేక పద్యములు కంఠస్థములు. తిక్కన శ్రీకృష్ణదేవరాయల కవితా వైవిధ్యమునకు ముగ్ధులై వారల కావ్యములలోని ఆయాపాత్రల వర్ణనా వైదుష్యమును, వింత సొబగులను సోదాహరణముగా నిరూపించునప్పుడు మాకు విస్మయము గలిగినది. గుంటూరు పరిసర ప్రాంతాలలోని వివిధ దృక్పథములు గల విద్యావంతులు, కళాభిమానులు తరచుగ కలసికొని వారివారి అభిరుచుల ననుసరించి ఆయా విషయములపై చర్చలు జరిపి సంప్రదింపులతో ఒకరినొకరు – అర్థము చేసికొను ముఖ్యోద్దేశముతో 23.10.1966 విజయదశమినాడు డాక్టరుగారి స్వగృహములో శ్రీ జాషువకవిగారి అధ్యక్షతన జరిగిన సమావేశములో "సాహితీ సదస్సు" ను ఏర్పాటు చేసితిమి. వివిధ విశిష్ట సాహితీ సిద్ధాంతములు, విభిన్న సాహిత్యాభిరుచులు గలిగిన కళారాధకు లందరికది యొక చక్కని వేదికగా రూపొందుట డా.సదాశివరావుగారి సదాశయమునకు నిదర్శనము. ప్రముఖ సాహితీమూర్తులు, అసామాన్యకీర్తిప్రతిష్ఠలు సంతరించుకొనిన కవిపురందరులు తమ రమణీయ ప్రసంగములతో కమనీయ కవిత గానములతో శ్రోతల నలరించిరి.

సర్వశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, బోడేపూడి వెంకటరావు, కాళోజి నారాయణరావు, ఆవుల సాంబశివరావు, జాషువా, కరుణశ్రీ, అమరేంద్ర, తుమ్మల సీతారామమూర్తి, దివాకర్ల వేంకటావధాని, వానమామలై వరదాచార్యులు, ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి, మరుపూడి కోదండరామరెడ్డి, సంజీవదేవ్, సి. నారాయణ రెడ్డి, శ్రీమతి నాయని కృష్ణకుమారి, శ్రీమతి యశోదా రెడ్డి, కె. రామలక్ష్మి ఆరుద్ర ప్రభృతుల నెందరినో ఆహ్వానించి ప్రసంగింపజేసిన ప్రత్యేక ఉపన్యాసములు సదస్యుల హృదయ ఫలకములపై శాశ్వతముద్రవైచినవి.

డాక్టరుగారు రచనలో ప్రతిభావంతులు. 1960 నవంబరులో ఆచార్య రంగాగారి షష్టిపూర్తి సంచికలోని వ్యాసమును జదివి అచ్చెరువందితిని. ఒకవైపు వైద్యరంగమున విశ్రాంతి నెరుగని కృషి సలుపుచు వేరొకవైపు ప్రశంసాపాత్రమైన రచనలొనరించుట విశేషము. నా ఆనందమును పట్టలేక ఆనాడే ఒక అభినందన లేఖ వ్రాసితిని. ఆ వ్యాసము చదివిన వారికి వారి రచనా పాటవము స్పష్టము గాగలదు. స్వతంత్ర ఆలోచనలతో పాటు ప్రత్యేకమైన శైలి అలవడినది. వారి రేడియో ప్రసంగములను, ఆయా సంద ర్భములలో అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసములను, సాహిత్యోపన్యాసములను, విదేశ పర్యటనానుభవములను అన్నిటిని ఒక సంపుట ముగా వెలువరించుట ఎంతైన అవసరము.

డాక్టరు జయప్రదాంబ గారు గూడ చక్కని రచయిత్రి. కమ్మని కథల నెన్నింటినో వ్రాసిరి. మా "స్వతంత్రవాణి"తో పాటు తదితర పత్రికలు ప్రచురించిన రచనలన్నింటిని సేకరింప నేనొక పర్యాయము ప్రయత్నించితిని. కాని సమయమునకు అవి లభింపలేదు. ఎప్పటికైన వానిని ప్రకటించుట సముచితము.

శస్త్రచికిత్సలో కూలంకష ప్రజ్ఞగల సదాశివరావుగారు వైద్యమునందువలె విద్యా, సాంఘిక, సాహిత్య, రాజకీయాది రంగముల యందును ప్రతిభా నైపుణ్యములను ప్రదర్శించి ప్రజల మనస్సులపై తరగని చెరగని ముద్రవేసికొనిన పరోపకార పరాయణులు. కవి పండితుల నాదరించి అనేక గ్రంథములను వెలుగులోనికి దెచ్చిన సాహితీ పోషకులు. తెలుగు మాగాణమున వందలకొలది వైద్యశాలలకు ప్రారంభోత్సవము లొనర్చిన అమృతహస్తులు. అభిప్రాయ భేదములున్న వారితోకూడ స్నేహ భావమున మెలగు సౌహార్ద సంపన్నులు. నైతిక విలువలు దిగజారుచున్న ఈనాటి సమాజమునకు ఆదర్శ ప్రాయులైన డాక్టరు సదాశివరావుగారి షష్ట్యబ్ద పూర్త్యుత్సవమును వైభవోపేతముగ జరుపుటకు పెద్దలు పూనుకొనుట నాకు ప్రత్యేక ముదావహము గలిగించినది. ఆహ్వాన సంఘమువారి కృషి అభినందనీయము.

డాక్టరుగారు విదేశపర్యటన జయప్రదముగ ముగించుకొని వచ్చిన సమయమున నేనొక అభినందన సంచికను ప్రచురింప నెంచితి. కాని అనివార్య కారణములచే వీలుపడలేదు. ఈ షష్ట్యబ్ద పర్వమునన్నైన నా కోరిక నేరవేర్చుకొనదలచి మిత్రులు శ్రీయుతులు కురిచేటి వెంకటేశ్వరరావు, నార్నె సాంబశివరావు, రావెల సాంబశివరావు, జొన్నలగడ్డ రామారావు, ఆలోకం పెద్దబ్బయ్య, పాతూరి కోటేశ్వరరావు ప్రభృతులకు నా మనమున నున్న సంకల్పమును తెలిపితిని. వారానందముగా ఆమోదించి పూనికనిచ్చిరి. వారికి కృతజ్ఞతలు.

సదాశివరావుగారితో నా పరిచయము ముప్పది యేండ్లకు పై బడినది. వైద్యముతో ప్రారంభమైన అనుబంధము వ్యక్తిగతముగా దృఢమైనది. అన్నిటికన్న వారి సౌజన్యము నన్నెక్కువగా ఆకర్షించింది. కనుక ఉదార స్వభావులైన కాసరనేని దంపతులకు సహృదయముగా ఈ "అభినందన చంద్రిక" ను సమర్పించు కొనుచున్న వాడను. నా అభ్యర్థనము మన్నించి తమ అమూల్యమైన సందేశములను, పద్య, గద్య, గేయాది రచనలను సకాలములో పంపి ఈ సంకలనమున కొక రూపమిచ్చిన మహనీయులకు, విద్వత్కవులకు, రచయితలకు, ప్రకటనకర్తలకు, సూచన లిచ్చిన మిత్రులకు నా మనః పూర్వక నమోవాకములు.



## అభినందనం

– "పండిత" – గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారితో నాకు దాదాపు పదైదేళ్ళ పరిచయం. వృత్తిలో, ప్రవృత్తిలో సదృశాభినివేశాన్నీ, సమాన ప్రతిభా విభవాన్నీ ప్రదర్శించి, పదిమందిచేతా ఔననిపించుకున్న అపూర్వ వ్యక్తులలో డాక్టర్ రావు గారొకరు. అందుచేత వారిని మిత్రులని వ్యవహరించడం సార్ధకమూ, సమంజసమూ!



వృత్తిరీత్యా సదాశివరావుగారు సుశ్రుతులు, పురాభారత గాథాచక్రంలో, శస్త్ర వైద్య విక్రమంలో ఆద్యుడుగా, ఆరాధ్యుడుగా ఉపశ్లోకితుడై సుశ్రుతుని విద్యాసంగతి శ్రీ సదాశివరావుగారిది. అతి నిశితమైన రోగ నిదానంలో, అనురూప చికిత్సా విధానంలో ఆనాటి శస్త్రధరుని విన్యాసానికి డాక్టర్ రావుగారి 'హస్తవాసి' అనుగ్రహం.

ప్రవృత్తి రీత్యా సైతం డాక్టర్ సదాశివరావుగారు సుశ్రుతులూ, బహుశ్రుతులూ అని చెప్పవచ్చు. వృద్ధోపసేవనం వల్ల, బహుముఖ సాహితీ శాస్త్రసంభావనం వల్ల సుష్టుశ్రుతులుగా విశ్రుతులు, సాధుకవితారాధకులుగా, సాహిత్యవేదికా సారధులుగా ప్రసిద్ధులు. 'సదా శాంతా సదా శుద్ధా' అన్నట్లు సదాశివరావుగారి చిత్తవృత్తి సదాసుసంపన్నము, బాహ్య ప్రకృతి సుప్రసన్నమూ, విద్యాదాతలుగా, వితరణ గుణ సముపేతులుగా అర్థి జనానికీ. విద్యార్థి జనానికి సులభులు. బహుముఖ ప్రముఖులైన రావుగారి వ్యక్తిత్వం ఆదర్శప్రాయం.

తెలుగు సంస్కృతి దీధితులు నలు చెరగులా ప్రసరించడానికీ, విశ్వవిజ్ఞాన విశాలరీతులు పరిశీలించడానికి వీరిటీవల జరిపిన విదేశ పర్యటనం, శుభప్రదంగా, **జయప్రదంగా** జరిగినందుకు మాకు మహానందం. డాక్టర్ సదాశివరావుగారి షష్ఠి పూర్తి మహోత్సవ సందర్భమున హార్ధికమైన మా అభినందనాలు, అభివందనాలు.

డాక్టరు గారు డాక్టరుగానే కాక వ్యక్తిగా కూడా ఉత్తను మానవుడు. ఇంతేకాదు ఆయన ఉత్తమ మానవతావాది కూడా. ఇది ఆయన మాటలలో, పనులలో అన్నింటా చూస్తాము. చాలామంది పెద్దలు తాము చెప్పటమేకాని, ఇతరులు చెప్పేది వినరు. సదాశివరావుగారు అలా కాదు. ఎవ్వరు చెప్పినా సరే ఓపికగా విని మంచి వుంటే నేర్చుకోవడానికి వెనుకాడరు. ఒక్క మాటలో చెప్పాలంటే సదాశివరావుగారు సంపూర్ణ మానవుడు. ★

# 'స్నేహశీలి'

– గౌతు లచ్చన్న

అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ లోక్ దళ్



మిత్రులు, పెద్దలు డాక్టరు సదాశివరావుగారి షష్టిపూర్తి మహోత్సవము గుంటూరులో జరుగనున్నదని విని, చాలా సంతోషపడ్డాను. డాక్టరు సదాశివరావుగారు కూడా రెండవ బాల్యదశకు చేరుకున్నారు. మా తరంలోకి వచ్చారని ఒక ప్రక్క సంతోషము కలిగినా, మరొక వంక మా లాగున వృద్ధులై పోయారని ప్రజలు భావించే పరిస్థితి యింత త్వరగా వచ్చిందే యనే ఆవేదన కూడా కలిగిందంటే నన్ను అపార్థము చేసుకోరని ఆశించుచున్నాను.

స్వాతంత్ర్య పోరాటరంగంలో రైతుబాంధవుడు ఆచార్య రంగాగారి నాయకత్వమున, 'రైతుకూలి' ప్రజారాజ్య ఆశయసిద్ధికి 5 దశాబ్దాల క్రిందట ప్రారంభమైన ప్రజా పోరాటాల కాలంలో డాక్టరుగారితో పరిచయభాగ్యం కలిగింది. పూజ్య బాపూజి నాయకత్వాన సత్య అహింసా సిద్ధాంతాలపై సాగుతున్న ఆనాటి స్వాతంత్ర్య పోరాటం మతవాద ధోరణి, బూర్జువావాదంతో కూడుకున్నదనే భావముతో ఆనాటి యువక లోకము సత్వర స్వాతంత్ర్య సముపార్జన జరగాలని, అది శ్రామిక నియంతృత్వ సామ్యవాద సమాజానికి పునాదులు వేసేదిగా నుండాలని ఉద్రేక ఉత్సాహములతో కమ్యూనిస్టు ప్రచారాలకు ప్రభావితులగుతుంటే మరి కొంతమంది చంద్రశేఖర అజాద్, భగత్ సింగు మున్నగు విప్లవవీరుల త్యాగాలు, బలిదానాలతో ఉత్తేజితులై అజ్ఞాత విప్లవోద్యమాలకు ఆకర్షింప బడుతున్నపుడు స్వచ్ఛమైన ప్రజాస్వామ్య పునాదులపై రైతు,కూలి ప్రజారాజ్య స్థాపనయే, ప్రజాస్వామ్య సమసమాజ స్థాపనకు ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక అభివృద్ధికి సరైన రాచబాటయని జాతీయస్థాయిలో ప్రధానము నూటికి 80 మందిగా నున్న పల్లెసీమ రైతుకూలి ప్రజలను, విద్యార్థులను, యువకులను ఉత్తేజపరచి, అటు నిరంకుశత్వానికి, దౌర్జన్యవాదానికి గురికాకుండా, యిటు కులమత వాదానికీ, బూర్జువా వాదానికి గురికాకుండా ఉత్తేజపరచి సంఘటిత శక్తితో చరిత్రాత్మకమైన రైతుకూలి పోరాటములను త్రికరణ శుద్ధిగా బలపరిచే ఆనాటి ప్రముఖ యువ నాయకులలో ఒకరు మన డాక్టరు సదాశివరావు. గొప్ప, బీద యనే తేడా లేకుండా డాక్టరు వృత్తి ధర్మాన్ని చిత్తశుద్ధితో నిర్వహించి పేదల డాక్టరనిపించుకున్న వారే మన డాక్టరు సదాశివరావు. కుల, మత

భేదాలను ద్వేషించి, సాంఘిక సంస్కరణ ఉద్య మాలలోను, సాహితీ, సాంస్కృతిక కళా రంగాలలో గూడా ముందడుగు ముఖ్యులుగా, సమాజము డాక్టరుగా అందరి మన్ననలు పొందిన ప్రజానాయకుడు మన డాక్టరు.

నీతినిజాయితీలతో రైతుకూలీ ప్రజల బుద్ధి జీవులకు సమాన ప్రతిపత్తి, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానికాభివృద్ధితో పాటుగా, సామాజిక న్యాయము కలుగజేయగల సమాజస్థాపన జరగాలనే సిద్ధాంతాశయాలు గల రాజకీయాలకు కట్టుబడి, అధికారపార్టీ ప్రలోభాలకు లోనుగాక, ఏలాంటి కష్టనష్టాలకు చలించక ఎవరి రాజకీయ సిద్ధాంతాలకు, ప్రజాపోరాటాలకు ప్రభావితులై, ఎవరిని తన గురువుగా భావించి రాజకీయరంగ ప్రవేశం చేసారో, ఆ ఆచార్య రంగా గారి కాంగ్రెసు పునఃప్రవేశం రాజకీయ దివాలాతనమని, అభివృద్ధికి నిరోధక, 'ప్రజా వ్యతిరేకచర్య'గా భావించి, రైతుకూలి ప్రజలకు నీతినిజాయితీలుగల నిజమైన నాయకుడు శ్రీ చరణ్ సింగ్. ఆయన నాయకత్వములో గల లోక్ దళ్ ద్వారానే ప్రజలకు, దేశానికి న్యాయము జరుగుతుందని త్రికరణశుద్ధితో విశ్వసించి రాష్ట్రశాఖకు నాయకత్వం సహించిన వారు మన డాక్టరు సదాశివరావుగారు. ఆ డాక్టరు సదాశివరావు గారిని నేనే కాదు, వారితో సహచర్యం గల వారెవరు గూడా వారి స్నేహశీలతను. నిష్కపట, నిస్వార్థ దేశభక్తిని, ఆప్యాయత అనురాగాలను, నీతి నిజాయితీలను ఎన్నడూ మరచిపోలేరు.

వారు కనీసము మరొక షష్టిపూర్తి మహోత్సవము జరుపుకోడానికి అవకాశము కల్పించి, ఆనాటి ఆత్మశుద్ధితో, సామాన్య ప్రజలకు నిజమైన న్యాయము కలిగించే సేవాధర్మానికి పునరంకితము చేయగల ప్రజానాయకత్వము ప్రసాదించి, ధన్యజీవిగా చేయుటకు ఆ పరమేశ్వరుని ప్రార్థించున్నాను. ★ జై హింద్

చదువు సంధ్యలేల సంస్కృతి లేకున్న ★ వ్రాత కోతలేల నీతి లేక ?
తెలివి తేటలేల విలువలు లేనిచో ? ★ నవయుగాల బాట నార్ల మాట!

## విద్యావేత్త

– డాక్టరు "అమరేంద్ర"

డాక్టరు కాసరనేని సదాశివరావుగారు సదాశయులు. సుహృదయులు. సహృదయులు. నిరంతర గ్రంథపఠనాసక్తితో బహుముఖమైన పాండితీవైభవం సంతరించుకున్నప్పటికీ, ప్రకర్షణాడంబరం వారి ధీరగంభీర ఉదార నిరాడంబర స్వభావానికి విరుద్ధం. సంభాషణల్లో వారి విస్తారమైన సర్వతోముఖ పరిజ్ఞానం భాసిస్తూ ఉంటుంది. వారి కుశలహస్తంతో మెరిసే శస్త్రానికి ఎంత పదును ఉన్నదో అంత నిశితధార వారి మేధాశక్తికి ఉన్నది కదా!

శస్త్రకళా నైపుణ్యంతోపాటు శాస్త్ర ప్రావీణ్యం సంపాదించి వైద్య బోధనారంగంలో దేశికోత్తములుగా ప్రఖ్యాతి పొందారు. డాక్టరుగారి శిష్యకోటి ఒక్క గుంటూరు మండలంలోనే కాక అమెరికా, కెనడాల వంటి సుదూర ప్రాంతాలలో కూడా గురువుగారి యశశ్చంద్రికలు విస్తరిస్తున్నారు. బోధకులుగానే కాక ఉన్నతాదర్శ కాంతి ప్రబోధకులుగా ఎందరి గురుపూజలో అందుకుంటున్న మార్గదర్శకులు మన డాక్టరు సదాశివరావుగారు.

అనేక విద్యాసంస్థలతో సన్నిహిత సంబంధము కొనసాగిస్తూ, వర్ధమానులైన విద్యార్థులనూ అధ్యాపకులనూ ఎదుర్కొంటున్న జటిల సమస్యలన్నీ చక్కగా ఆకళించుకున్న విద్యాభిమాని, విద్యావేత్త మన డాక్టరు సదాశివరావుగారు. ★

## బహుధా

– శ్రీ ఆవుల సాంబశివరావు



డాక్టరు సదాశివరావుగారిది వైవిధ్యం గల వ్యక్తిత్వం. అంత బహురూపు లైన వ్యక్తులు అరుదు.

తన జీవితాన్ని తానే నిర్మించుకొన్న సృష్టికర్త. అనుకూల పరిస్థితులులేని వాతావరణంలో పుట్టి, వైద్యుడై, ప్రముఖుడై, మనీషిగా ఎదగడంలో ఆయన స్వయంకృషే కారణం. ఆయన్ని అదృష్టం కాదు వరించింది. తన కృతనిశ్చయం, తన కృషి.

అంతేకాక తన అభివృద్ధితో ఆయన తృప్తి చెందలేదు. తన కుటుంబంలోని యిరు వాగులవారికి చేయూతనిచ్చి, పైకి తెచ్చారు. ఇంట గెలిచి, ఇంట మెరిసి, బయట వెలిగిన అసాధారణ వ్యక్తి, ఆయన ఔదార్యవంతుడు.

మానవత్వం వారి ప్రధానగుణం. వివిధరీతులలో నడిచిన వారి కార్యక్రమాలన్నిటిలో సదాశివరావుగారిలోని మానవతామూర్తి ప్రత్యక్షమవుతుంది.

వైద్యుడుగా తీసుకొందాం. అక్కడ కూడా వైవిధ్యమే, మనసున్న మనిషే. ఒక చెంప శస్త్రచికిత్స, మరో చెంప సాధారణ వైద్యం. గణన కెక్కిన రోగనివారకుడు. ఒక్కసారి ఆయన వైద్యానికి అలవాటు పడ్డ రోగి, యింకొక వైద్యుని వద్దకు వెళ్ళడం అరుదు. దానికి సదాశివరావుగారి వైద్యనైపుణ్యం ఒక్కటే కారణం కాదు. వారుచూపే ఆదరణ, ఆప్యాయత అర్తుడైన రోగిహృదయం మీద అమృతాభిషేకం చేస్తాయి. రోగుల హృదయాలలో శాశ్వత పీఠం వేసుక్కూర్చున్న భిషగ్వరుడు సదాశివరావుగారు.

సాహితీరంగంలో ఆయనదొక పీఠం. దాని ద్వారాలు అందరకూ తెరిచే వుంటాయి. వారిచ్చిన అండదండలతో, దీప్తితో ప్రోత్సాహంతో ఎంత మంది కవులు బయటకు వచ్చారు! ఎన్నెన్నో రచనలు వచ్చాయి! ఎందరో యువతీ యువకులు రచయితలైనారు. సాహితీ సదస్సులు ఆయనకు ప్రీతిపాత్రమైన కార్యక్రమాలు. వాటికి ఆయన ఒక కేంద్రం, ఒక ప్రాణం.

ఆయన హృదయం రసధుని. అటువంటివారి స్ఫూర్తితోనే పెరుగుతాయి. కవిత, భావుకత, రచనా, వైద్యవృత్తిలో తలమునకలైన పని అనవరతమూ వుండినా, రసజ్ఞులలో మేటి. సాహితీగోష్ఠులకు వారికి సమయం వుంటూనే ఉంటుంది. మనసున్నప్పుడు సమయం ఉండదా!

విద్యకున్న ప్రభావాన్ని సదాశివరావుగారు తన అనుభవంలోనే తెలుసుకొన్నారు. తన కుటుంబంలోని వారందరినీ, విద్యావంతుల్ని చేశారు. విద్యాలయాలకు ఆయన పోషకుడు, కొన్నిటికి కార్యకర్త. సమాజంలో విద్యాప్రచారం అవసరాన్ని బాగా గుర్తించిన ప్రముఖులలో గుంటూరు పరిసరాలలో సదాశివరావు గారు చురుకైన కార్యకర్త. సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలు ఆయనకు బాగా యిష్టం. ఆయన దృష్టి ఒక్క గుంటూరు పట్టణానికే పరిమితమై లేదు. పల్లెలు బాగు పడంది దేశం బాగుపడదని గుర్తించిన ద్రష్ట. అందుకే పల్లె ప్రాంతాలతో సదాశివరావుగారికి ఆత్మీయమైన సంబంధం.

సదాశివరావుగారిలో సహజ నాయకత్వలక్షణాలు ఉన్నాయి. మనుష్యులను ఆకట్టుకోగలరు. కార్యోన్ముఖుల్ని చేయగలరు. సంఘటితం చెయ్యగలరు. నడిపించగలరు. అది చండశాసనుడై చేసే పనికాదు. తన విశిష్టమైన మానవతా లక్షణాలతో, ఔదార్యంతో, సరసత్వంతో సాధించిన గుణం.

చాలాకాలం నుండి వారు రాజకీయాల్లో ఉంటూనే వున్నారు. ఎన్నికలలో పోటీ చేస్తూనే ఉన్నారు. గెలుపు, ఓటములకు చలించలేదు. తన వైద్యవృత్తికి భంగం కలగనివ్వలేదు. అంతకుమించి రాజకీయ కాలుష్యాన్ని తన మనస్సుకు చేరనివ్వ లేదు. హంస మీద నీరు అంటకుండా జారిపోయినట్లు, రాజకీయవాసనలు వారిని విడిగా మిగిలిపోయాయి. సాధ్యం, పక్వత సాధించిన మనుషులకే రాజకీయాలు పరమావధి కాదు, జీవితం లోని ఒక అంశం మాత్రమేనని సదాశివరావుగారు నిరూపించారు.

అన్నీ చెప్పి వారి అర్ధాంగి జయప్రద గారిని గురించి చెప్పకపోతే, సదాశివరావు గారి కథకు సంపూర్ణత్వం వ్యక్తిత్వ వికాసానికి లేదు. సహధర్మచారిణిగా జయప్రదగారు నిర్వహించిన పాత్ర విలువైనది. ఆ దంపతుల్ని వారి కళ్యాణసమయం నుండి ఎరుగుదును. ఇద్దరూ కష్టసుఖాలను సమంగా పంచుకొన్నారు. వారి జంటజీవితయాత్ర ఫలవంతమైంది. సంసారం నుండి బంగారుపంటలు పండించుకొన్నారు. వారిద్దరిదీ జీవితంలో, వైద్యంలో, సాంఘిక కార్యక్రమాలలో జంటకవనమే. కమనీయమైన సంసార కవితను కల్పించారు.

ఇంత బహుధా విస్తరించి, వికసించిన సదాశివరావుగారికి, షష్టిపూర్తి సందర్భములో శుభాకాంక్షలు అందజేస్తున్నాను. 'అరవై' ఒక అంచుకాదు. ఒక 'మైలురాయి' మాత్రమే. దీప్తి నిండిన భవిష్యత్తు వారిది కావాలని వారికి నా ఆకాంక్షలు అందజేస్తున్నాను. ★



మంచివారి సంపాదన మంచివారికి, చెడ్డవారి సంపాదన చెడ్డవారికి వినియోగపడుతుంది.
మామిడిపండ్లు చిలుకలు ఆరగించడం, వేపపండ్లు కాకులు తినడం, లోకంలో జరుగుతున్నదేగదా.

– భవభూతి

"జర్నలిజంగానీ వైద్యంగానీ సంపాదన కొరకే కాదు.
సేవా దృక్పథంతో గూడ చేపట్టవలసి వుంటుంది."

## బహుముఖ ప్రజ్ఞాశాలి

- భావరాజ నరసింహారావు

ఆంధ్రదేశ చరిత్రలో గుంటూరు జిల్లాకి ఒక విశిష్టస్థానం ఉన్నది. చారిత్రికంగా పల్నాటి వీరుల గాథ మనల్ని ఎప్పుడూ ఉత్తేజ పరుస్తూనే ఉంటుంది. ఆ తరువాత ఆధునిక కాలంలో కూడా గుంటూరు జిల్లా ఎప్పుడూ అగ్రగామిగానే ఉంటున్నది. భాషాప్రయుక్త రాష్ట్ర ఉద్యమం బాపట్లలో ప్రారంభం అయింది. (1913), భారత స్వాతంత్ర్య ఉద్యమంలో ప్రముఖులైన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, దేశభక్తి కొండ వెంకటప్పయ్య, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఎన్. జి. రంగా. ఉన్నవ లక్ష్మీ నారాయణ, గొల్లపూడి సీతారామశాస్త్రి, వావిలాల గోపాలకృష్ణయ్య మొదలైన నాయకులందరూ గుంటూరుజిల్లా వారే.

జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, కల్లూరి చంద్రమౌళి, పి. వి. కృష్ణయ్య చౌదరి, ఎన్.వి.ఎల్. నరసింహారావు, కాసు బ్రహ్మానందరెడ్డి మున్నగు ప్రజానాయకులు గుంటూరు జిల్లావారు.

మహాభారతాన్ని తెలుగువారికి ప్రసాదించిన కవిత్రయంలో ప్రధాన కవి అయిన తిక్కన సోమయాజి గుంటూరు వాడేకదా! తెనాలి రామకృష్ణకవి, తుమ్మల సీతారామమూర్తి, రాయప్రోలు వెంకట సుబ్బారావు, కాశి కృష్ణాచార్యులు, నాయని సుబ్బారావు, శివశంకరస్వామి, నోరి నరసింహశాస్త్రి, త్రిపురనేని రామస్వామిచౌదరి, మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి, ఏటుకూరి వెంకట నరసయ్య, గుడిపాటి వెంకటచలం మున్నగు కవిపుంగవులు గుంటూరు జిల్లావారు.

సోదరులు పత్రికారంగంలో ప్రఖ్యాతిపొందిన కోటంరాజు సోదరులు పున్నయ్య, రామారావు, "త్రివేణి" పత్రిక వ్యవస్థాపక – సంపాదకులు కోలవెన్ను రామకోటేశ్వరరావు ప్రభృతులు గుంటూరుజిల్లా వారు. నాటక కళారంగంలో ధ్రువతారలుగా వెలిగిన హరి ప్రసాదరావు. బెల్లంకొండ సుబ్బారావు, స్థానం నరసింహారావు, మాధవ పెద్ది వెంకటరామయ్య, డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు మొదలైన వారందరూ గుంటూరుజిల్లా వారే.

ఆంధ్రులలో డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ తరువాత విశ్వవిఖ్యాతిని ఆర్జించిన తత్వశాస్త్రవేత్త డాక్టరు కొత్త సచ్చిదానందమూర్తి గుంటూరు జిల్లావారే. పొగాకు వ్యాపార రంగంలో భారతదేశానికి ఎక్కువ విదేశీ మారకద్రవ్యాన్ని ఈనాడు ఆర్జించి పెడుతున్నది గుంటూరు జిల్లా. ఇలా అనేక రంగాలలో ఆంధ్రదేశంలో కీలక స్థానమూ, అగ్రస్థానమూ గుంటూరుజిల్లాదే. స్వాతంత్ర్య ఉద్యమంలో ఎక్కువమంది దేశభక్తులు జైలుకి వెళ్ళింది గుంటూరు జిల్లా నుంచే. రెండవ ప్రపంచ మహాయుద్ధకాలంలో అధిక యుద్ధనిధిని వసూలు చేసింది గుంటూరుజిల్లా. ఇటీవల ప్రత్యేక ఆంధ్ర ఉద్యమంలో కూడా గుంటూరు అగ్రగామిగా ఉంది.

ఇలాంటి విఖ్యాతిని గడించుకున్న గుంటూరు జిల్లాలో ఈనాడు వైద్యరంగంలో అత్యంత ప్రఖ్యాతిని ముఖ్యంగా గొప్ప సర్జన్ గా ఆర్జించిన ప్రముఖులు డాక్టర్ కాసరనేని సదాశివరావుగారు, సహృదయులు, కవిశేఖరులు, నా అత్యంత ప్రియమిత్రులు శ్రీయుతులు బోడేపూడి వేంకటరావు గారు రెండు దశాబ్దాలకు పూర్వం నాకు పరిచయం చేశారు డాక్టరు సదాశివరావుగారిని.



*"ఆరమ్భ గుర్వీ క్షయణీ క్రమేణ*
*లఘ్వీ పురావృద్ధి ముపైతి పశ్చాత్*
*దినస్య పూర్వార్ధ పరార్థ భిన్నా*
*ఛాయేవ మైత్రీఖల సజ్జనానామ్"*

అని భర్తృహరి చెప్పాడు. దుర్జనుల స్నేహం ప్రాతః కాలపు నీడలాగ మొదట ఎక్కువగా ఉండి క్రమంగా క్షీణిస్తుంది. సజ్జనుల మైత్రి సాయంకాలపు నీడవలె మొదట చిన్నదై క్రమంగా వృద్ధిపొందుతుంది. మా మైత్రి ఈ రెండవకోవకు చెందినది. ఇది మా ఉభయులకు ఆనందాన్ని చేకూరుస్తున్నది. డాక్టర్ సదాశివరావుగారిని నాకు ఎక్కువ సన్నిహితులుగా చేసింది ఆయన సాహితీప్రియత్వం. నిత్యమూ తమ నర్సింగ్ హోమ్ ఎంతో దీక్షతో, దక్షతతో ఎక్కువ కాలాన్ని ఆయన వినియోగిస్తారు. చాలా శ్రమకు ఓర్చి పనిచేస్తారు. ఆయనకు సాహిత్యం మీద మక్కువ ఎక్కువ. అందుచేత గ్రంథపఠనం కూడా ఆయన దైనందిన జీవితంలో చోటు చేసుకున్నది. అది అంతటితో ఆగలేదు. సాహితీ సదస్సును స్థాపించి బహుకాలంగా ఆయన సాహిత్యోపన్యాసాలు ఏర్పాటు చేస్తున్నారు. ఎంతోమంది రసజ్ఞులు వాటిని ఆస్వాదిస్తున్నారు, యువకులు చైతన్యవంతులు అవుతున్నారు.

చాలా త్వరగా పెరుగుతున్న గుంటూరు పట్టణానికి జనాభా నిష్పత్తి దృష్ట్యా కాలేజీలు అదనంగా కావలసి ఉన్నవని గ్రహించి తను వ్యవస్థాపక, కార్యదర్శిగా ఉండి జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాలను స్థాపించి చక్కగా నిర్వహిస్తున్నారు. తన వైద్యవృత్తికి సంబంధించిన అనేక సంస్థలతో సన్నిహిత సంబంధాలు పెంచుకుని. తన సహకారాన్ని అందిస్తున్నారు.

ఇటీవల కాకాని గ్రామంలో యార్లగడ్డ వెంకన్నచౌదరిగారు నెలకొల్పతలచిన కేన్సర్ హాస్పిటల్ కు సదాశివరావుగారు వ్యవస్థాపక కార్యదర్శిగా నిర్వహించబూనటం చాలా ఉచితంగా ఉన్నది. డాక్టరు సదాశివరావుగారిది ఒక ఆదర్శ వైద్య కుటుంబం. ఆయన సతీమణి, డాక్టరు, సోదరులు డాక్టర్లు. కుమాళ్ళు, కూతుళ్ళు డాక్టర్లు. ఆ కుటుంబం. అందరూ వైద్యం ద్వారా ఉత్కృష్టమైన ప్రజాసేవ చేస్తున్నారు.

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన సదాశివరావుగారు యథోచితంగా యింతకాలమూ ప్రజాసేవ చేస్తున్నారు. ఇప్పుడు రాజకీయ రంగంలోకి ప్రవేశించారు. "దేశం నాకేమి చేస్తుంది?" అన్న ఆశతో కాకుండా "దేశానికి నేను యింకా సేవచేయాలి" అనే సదాశయంతో సదాశివరావుగారు రంగప్రవేశం చేసారు. అటువంటి ప్రజా సేవకుల పవిత్ర ఆశయాలను గుర్తించి, అలాంటి ఉత్తమ నాయకులను తమ ప్రతినిధులుగా, ఎన్నుకోవటం ప్రజల విధి. సదాశివరావుగారు దేశసేవ చేయడానికే కంకణం కట్టుకున్నారు. దేశం ఆయన సేవను ఇతర రంగాలలోకూడా ఎంతవరకు సద్వినియోగం చేసుకుంటుందో చూడవలసి ఉంది. డాక్టరు సదాశివరావుగారికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉన్నది, సందేహం లేదు. ★

## సాహిత్యాభిమాని

- డాక్టరు ఎస్. గంగప్ప, నాగార్జున యూనివర్శిటి

వృత్తి, ప్రవృత్తి ఒకటే అయినప్పుడు ఒకవ్యక్తి గొప్పదనాన్ని గూర్చి ప్రత్యేకంగా పేర్కొనవసరంలేదు. కానీ వృత్తి ఒకటి, ప్రవృత్తి వేరొకటి అయినప్పుడు అలాంటివారిని గూర్చి తప్పక విశేషించి వివరించటం ఎంతైనా అవసరం ఉంది, అవకాశమూ ఉంది. ఈనాడు షష్టిపూర్తి జరుపుకొంటున్న అలాంటి మహనీయుడు డాక్టరు కాసరనేని సదాశివరావుగారు.

వైద్యవృత్తిని స్వీకరించిన సదాశివరావుగారు ధనమే మూలమని భావించి ఉంటే ఈ ఆరుపదుల కాలంలో ఎంతో సంపన్నులయ్యేవారు. కాని వారిదృష్టి మానవతాదృష్టి, నిరుపేదల బాధల గాధల గూర్చి కూలంకష పరిజ్ఞానమున్న దయాహృదయుడు కావడం వల్ల డబ్బుకు విలువనీయక మనిషికి, మనిషి మనసు లోని విశిష్ట గుణాలకు పెద్ద పీఠం హృదయంలో వేసుకొని ఉండడంవల్ల వారు డబ్బుపై మొగ్గుచూపలేదు, మోజుపడలేదు. అది వారి విశిష్టగుణ గరిష్టతకు నిదర్శనం. శస్త్ర చికిత్సా నిపుణులుగా ఎంతైనా గడింపవచ్చు. కానీ సామాన్య ప్రజానీకానికి చేతనైనంత ఉదారంగా సాయం చేయడమే, తమ ధ్యేయంగా ఉంచుకొన్న మహోదారులు డాక్టరుగారు. వారికన్ని విధాలా జీవితయానంలో చేదోడువాదోడుగా ఉన్నవారు వారి సహధర్మచారిణి డాక్టరు (శ్రీమతి) జయప్రదాంబగారు. వైద్యవృత్తితోనే సంతృప్తిపడక రాజకీయాల్లో సైతం తమ విశిష్టతను వ్యక్తీకరించడం కోసమూ, తన్మూలంగా ప్రజాసేవ చేయవచ్చుననే కోరికతోనూ మరోపక్క తాము శ్రమిస్తూనే ఉండటం నేను ప్రత్యేకంగా పేర్కొనవసరంలేదు. అది అందరికీ తెలిసిన అంశమే.

సరళమూ, ఉదారమూ అయిన స్వభావం గలవారు సదాశివరావుగారు. ఎంత తక్కువ ఖర్చుతో రోగనివారణ చేయవచ్చునో, అవసరమనుకొన్న శస్త్ర చికిత్సను సైతం తగిన ఔషధాలతో ఎలా నయము చేయవచ్చునో డాక్టరుగారు ప్రయోగపూర్వకంగా చేసి చూపించారు. తప్పనిసరి అయినప్పుడు శస్త్ర చికిత్సలోనూ తమ నైపుణ్యాన్ని ప్రకటించి అతి స్వల్పమైన ఖర్చుతో రోగికి ఎంతో సహకరించే దయామూర్తి డాక్టరుగారు. ఇవన్నీ వారు స్వీకరించిన వృత్తికి సంబంధించిన ప్రతిభానైపుణ్యాలు, దయ, ఔదార్యాది స్వభావాలు మొదలైన ఉత్తమ గుణాల్ని వ్యక్తీకరించేవి.

ఇక డాక్టరుగారి మరో మూర్తి వారి ప్రవృత్తి. వారి ప్రవృత్తి సాహితీ సమాలోచన. సాహిత్యమూ, సాహితీపరులు అంటే వారికెంతో గౌరవం, ఆనందమూ. అందుకు నిదర్శనం వారి అధ్యక్షతన కొనసాగుతున్న సాహితీ సదస్సు. ఈ సదస్సు మూలంగా ఎందరో కవులు, రచయితలు, కళాకారులు, సాహితీవేత్తలు డాక్టరుగారి చేతిమీదుగా సమ్మానించబడ్డారు. సాహిత్యమనేసరికి వృత్తిని గూడ విస్మరిస్తారు, వచ్చే లాభాన్ని గూడ లెక్క చేయరు. సాహితీపరులతో సంభాషించడమంటే వారికి ఎనలేని సరదా, సంతోషమూ. ఏదైనా వైద్య సంబంధమైన సలహాకోసం డాక్టరు గారిని సందర్శిస్తే వారు సాహితీపరులైతే సాహిత్య సంబంధమైన చర్చలోనే మునిగిపోతారు. అక్కడ వేచిఉన్న రోగులు గూడ శ్రోతలు కావలసిందే, తప్పదు.

ఈ సాహితీ సదస్సులో ఇలాంటి సన్నివేశాలు డాక్టరుగారితో ఎనిమిదేళ్ళ పరిచయమే అయినా నాకు లభించడం నా జీవితంలో మరపురాని ఘట్టాలుగా మిగిలిపోతాయి. వారు అతి ప్రాచీన సాహిత్యం దగ్గరనుంచి, అతి నవీన సాహిత్యం వరకు కూలంకష పరిజ్ఞానం కలవారు. వారికి తిక్కన అంటే, శ్రీకృష్ణదేవరాయలంటే ఎంతో ఇష్టం. వారి పద్యాలలా అప్పగించేస్తారు. అందులో ఓ పద్యం

*"శయపూజాంబుజముల్లుటిం దద బాడన్ జన్దోయి లేఁ గౌనుపై*
*దయఁ దిప్పన్ బసపాడి పొగడపుఁ బాదంగొప్పఁ జెంగల్వ డి*
*గ్గియ నీ రచ్యుత మజ్జనార్థము కటిం గిలించి దివ్యప్రబం*
*ధ యుగాస్యల్ ద్రవిణాంగనల్ నడతురుద్యానంపు లోఁ ద్రోవలన్" (ఆముక్తమాల్యద – 1:56)*

ఇందులో అచ్యుత మజ్జనార్థం ద్రావిడ స్త్రీలు నీళ్లు తీసుకొనివచ్చే తీరు వర్ణితం. కవి స్వభావోక్తిలో మనోహరంగా వర్ణించడం డాక్టరుగారికి ఎంతో ఆనందాన్నిచ్చింది. విల్లిపుత్తూరులోని ద్రావిడ స్త్రీలు ఉద్యానవనాల్లోని చెంగలువకొలకుల్లో పసుపు రాసుకొని స్నానంచేసి శ్రీ విష్ణువునకు తిరుమజ్జనం కోసం బిందెలను కటిపై నుంచుకొని, పూజకోసం పద్మాలు బిందెలలో తొ(త్రిల్లుతుండగా, స్తనభారంతో లేవేమో అనుకొనబడుతున్న నడుములూగుతుండగా దివ్యప్రబంధాలు చదువుతూ ఉద్యానాల లోపల త్రోవలలో పావడలు ధరించిన కాళ్ళతో నడుస్తూ ఉంటారట. ఇది చిత్రణ. ఇది మిక్కిలి ఆహ్లాదకరమైన సన్నివేశం. సహృదయ హృదయాలను అలరించే అంశం. దీన్ని గమనించిన డాక్టరుగారు తాము పొందిన రసానందాన్ని చర్చించి వ్యక్తీకరించేవారు.

అలాగే జాషువా కవిగారంటే.. గౌరవంగా కవిగారితో డాక్టరుగారికి పరిచయం ఉండటం గూడ దీనికి కారణం గావచ్చు. అంతేగాక లలితమైన పదాలతో, సరళమైన భాషతో, అత్యంత మనోజ్ఞంగా, ఆర్తితో, సామాజిక స్పృహతో బడుగువర్గాలలోని జాషువా కవి చెప్పిన కవిత అంటే మరీ ఇష్టం డాక్టరుగారికి. జాషువా అమృతవాక్కుల్ని డాక్టరు గారు మరిచిపోలేదు, ముంతాజ్ మహల్ లోని చివరి పద్యం :–

*"రాణి విడిచిపోయె రాజు నొంటరిఁజేసి*
*రాజు విడిచిపోయె రాజ్య రమను,*
*రాజ్య రమయు విడిచె రాజులఁ బెక్కండ్ర*
*రాణి విడువలేదు రాజసంబు."*

ఈ పద్యాన్ని డాక్టరుగారు మరీమరీ మననం చేసికొని జాషువా కవి ప్రతిభనుగూర్చి మురిసిపోతుంటారు. "పాఠకుల్ని ముగ్ధుల్ని చేసి హృదయాలకు హత్తుకొనేదే నిజమైన కవిత" అని, అది జాషువాగారిలో పుష్కలంగా ఉందని వారి విశ్వాసం. ఒక సందర్భంలో ఒక చిన్న అంశాన్ని నాతో ముచ్చటించారు. ఈ అంశం వివరిస్తే వారికెంత లోతైన సాహిత్యావగాహన ఉందో స్పష్టమవుతుంది. జాషువా గారి "పిరదౌసి" కావ్యంలో రెండు పద్యాలు రెండుసార్లు పునరావృత్తాలవుతాయి. లాక్షణికుల దృష్టిలో పునరుక్తి కావ్యదోషం. అయితే అది ఔచితీ సహజమైతే దోషదూషితం కాదు. అలాంటిది పిరదౌసి కావ్యంలో ఉంది. దానికంటే ముందు మరో ఉదాహరణ వారు పేర్కొని జాషువా కవి చేసిన పద్య పునరావృత్తి ఎంతో ఔచిత్యంతో, శిల్పరమణీయంగా ఉందని ఉటంకించారు.

పిరదౌసి కావ్యంలో మహమ్మదు గజనీ పిరదౌసి కవిని పిలిపించి "షానామా"ను రచించి తన కంకితమిస్తే పద్యానికొక దీనారం (బంగారు నాణెం) ఇస్తానని వాగ్దానం చేస్తాడు. పిరదౌసి అంగీకరించి తన ప్రతిభా నైపుణ్యాల్ని ప్రకటిస్తూ పండిత ప్రకాండుల మెచ్చుకోలు పాత్రమయ్యేలా కావ్యరచన చేసిన రాజు కంకితమిస్తాడు. రాజు తన వాగ్దానాన్ని త్రోసిపుచ్చి బంగారు నాణాలకు బదులు వెండి నాణాలు పంపుతాడు. అందుకు అవమానితుడై, దుఃఖితుడై పిరదౌసి ఆ పారితోషికాన్ని తిరస్కరిస్తాడు. రెండు పద్యాలు రాసి పంపుతాడు. అందుకు క్రుద్ధుడైన గజనీ పిరదౌసికి మరణదండన విధిస్తాడు. ఈ విషయం ముందే తెలిసిన పిరదౌసి తన స్వస్థలమైన తూసు పట్టణానికి భార్యా, సుతాసమేతుడై వెళ్ళిపోతాడు. క్రమంగా గజనీ మనస్సులో మార్పు రాసాగింది.

ఒకరోజు ఉదయాన మసీదుకు వెళ్ళి అల్లాను ప్రార్థించి వస్తూ గోడపై పిరదౌసిచే విరచితమైన పద్యాలు చూడడం తటస్థించింది. ఆ పద్యాలివి:




ఇవే పద్యాలు మొదట ప్రధమాశ్వాసంలో ఉన్నాయి, ఇప్పుడు మళ్ళీ చతుర్థాశ్వాసంలో పునరావృత్తమయ్యాయి.... ఈ పద్యాలు పిరదౌసి హృదయవేదనకు నిదర్శనం. అలాగే గజనీకి కనువిప్పును కలిగించాయి. కావ్యశిల్ప రమణీయకానికి ఉపకరించాయి. ఎంతో ఔచితీ సహజమై ఒప్పుతున్నాయి. ఇది జాషువా కవి ప్రతిభకు, కవితా కమనీయకానికి నిదర్శనం. ఇలా పునరావృత్తాలైన పద్యాలు ప్రాచీన కావ్యాలలో గూడా ఉన్నాయి.

భారతం విరాటపర్వం ద్వితీయాశ్వాసంలో 55 వ పద్యం "దుర్వారోద్యమబాహు విక్రమ"– అని సైరంధ్రి కీచకుని భయపెట్టడంలో, ఆ వెనుక తన్నవమానించిన కీచకుని భయపెట్టానని వలలునకు చెప్పినప్పుడు పునరావృత్తం చేస్తుంది. ఇందులో విశిష్టత లేకపోలేదు. ఇంకా ఇలాగే తిక్కనను అన్ని విధాలా అనుసరించినాడనదగ్గ పింగళి సూరన "కళాపూర్ణోదయంలో కలభాషిణి చెలికత్తెలతో ఉయ్యాల లూగుతుండగా నారదమహర్షిని సేవిస్తూ ఆకాశమార్గాన వస్తున్న మణికంధరుడు మెచ్చుకొని గురువు నారదమహర్షితో విన్నవించగా నారదుడు– "భళిరా సత్కవి కౌదు నిక్కమ తగన్భావించి నీవన్నయా యెల ప్రాయంపు టారికత్తెల బెడంగే నెందునుంగాన. ..." అని మెచ్చుకొంటాడు. ఈ మాటలు సమీపంలోనే రంభా నలకూబరులు వెడుతూ ఉండి స్పష్టం కాక మళ్ళీ రంభ నారదుని అడుగగా నారదుడు పునరావృత్తి చేస్తాడు. ఈ పద్యానికి సైతం ప్రబంధంలో విశిష్టత ఉంది.

తిక్కన పద్యమూ, సూరన పద్యమూ కథాగమనానికి ఉపకరించగా, జాషువా కవిగారి పద్యాలు సముచితరీతిని ప్రయుక్తం అని, ఇది కావ్యశిల్పం అని, ఇందులో ఔచిత్యం ఉందని, పునరుక్తిదోషం కాదని డాక్టరు గారు గంటల తరబడి ముచ్చటిస్తారు. వీరితో సంభాషించటమంటే సాహిత్య సమారాధనమే. అందుకే సదాశివరావుగారు వృత్తిరీత్యా వైద్యులైనా, ప్రవృత్తిరీత్యా సాహిత్యాభిమాని. ఇలాంటి డాక్టరుగారు ఆయురారోగ్యాలతో సుఖసంతోషాలతో, వృత్తి, ప్రవృత్తులతో సర్వదా, సర్వదా జీవితయాత్ర సాగించాలని ఆకాంక్షిస్తున్నాను. ★

**అభినందనలు:**

**నమస్సుమాంజలులు:**

కోటపాటి హరిబాబు ★ తలుపుల వీరయ్య

నందిపాటి శంకరరావు ★ మేడూరి రామారావు

సహృదయులు, సాహితీ ప్రియులు, శాసన సభ్యులు గారికి హృదయపూర్వక

శుభాకాంక్షలు

విజ్ఞాన్ రెసిడెన్షియల్ కాలేజి, వడ్లమూడి

విజ్ఞాన్ లిటిల్ పబ్లిక్ స్కూల్, లక్ష్మీపురం

విజ్ఞాన్ ట్యుటోరియల్స్,బ్రాడీపేట

యల్.రత్తయ్య, డైరక్టర్

శుభాకాంక్షలు:

విద్యాదాన ప్రదాత, కవితా రాజపోషకులు,

నైతిక విలువలు మూర్తీభవించిన మహామూర్తి

నిస్వార్థ సేవా పరాయణుడు ఎన్నో... ఎన్నెన్నో సుగుణాలు.,

ఓ మహా మనీషీ! మీ షష్టి పూర్ణోత్సవం, ప్రజా సంధాయకం

మాకు పరిపూర్ణ సంతోషోత్సవం.

ప్రిన్సిపాల్, అమరావతి రెసిడెన్షియల్ కళాశాల, గుంటూరు-4

Best Compliments:
Vikramaditya Tutorials,
GUNTUR -4
We live in deeds, not in years,
Of you it can be truly said 'YOU'
Live in both – deed and years
Warmest Congratulations.
Director

Siddhartha Residential College,

Siddhartha School,

Lakshmipuram, GUNTUR – 7

M. RAMARAO, DIRECTOR

Sri Lakshmi Srinivasa Cotton Traders,

Cotton Ginning & Pressing Factory, Nallapadu,

GUNTUR-5

ALLIED PUBLISHERS

Subscription Agency,

Mount Road, CHENNAI -600 002

Priyadarshini Residential College, Maths & Science,

6\4, Arundelpet, GUNTUR-2

Muddana Abbaiah, Director.

కృష్ణ వర్ధన్ సిమెంట్స్

అశోక్ నగర్,

హైదరాబాద్ -500 020.

CHETANA ENTERPRISES,

Tobacco Growers, Redriers & Exporters

GUNTUR – 7

-----

## డాక్టర్ రావ్ – వ్యక్తిత్వ విశ్లేషణ

-డాక్టర్ సంజీవదేవ్



సైకాలజీలో రెండు పదాలున్నాయి. 'ప్రొజెక్షన్', 'ఇన్ ట్రోజక్షన్' అని.

మొదటిదానికి సంబంధించిన వ్యక్తి ఇతర్లలో తనను చూచుకొంటాడు, ఇతర్ల ఆలోచనల్లో తన ఆలోచనల్ని కనుగొంటాడు, ఇతర్ల వేదనల్లో, సంవేదనల్లో తన వాటిని దర్శిస్తాడు. తనకు భిన్న మైనదంతా తన స్వీయ వ్యక్తిత్వమే అని భావిస్తాడు, విశ్వసిస్తాడు.

రెండవదానికి సంబంధించిన వ్యక్తి తనలో ఇతర్లను చూస్తాడు, తన ఆలోచనల్లో ఇతర ఆలోచనల్ని కనుగొంటాడు, తన వేదనల్లో, సంవేదనల్లో ఇతర వాటిని దర్శిస్తాడు. తన స్వీయమైనదంతా తనది మాత్రమే కాక ఇతర్ల వ్యక్తిత్వమని కూడ భావిస్తాడు, విశ్వసిస్తాడు; తన స్వంత వీణలో విశ్వ సంగీతాన్ని వింటాడు.

'ప్రొజెక్షన్' అనేది వ్యక్తి నుండి విశ్వం లోకి వికేంద్రీకరణ; 'ఇన్ ట్రోజక్షన్' అనేది వ్యక్తి లోకి కేంద్రీకరణ.

డాక్టర్ రావ్ గారు పై రెంటిలో దేనికి చెందుతారు? అంటే సమాధానం దొరకటం కష్టం. ఏ ఒకదానికో ఆయన చెందుతారన్నా అది వాస్తవాన్ని మరుగుపరచటమే అవుతుంది.

ప్రొజక్షన్ కు మాత్రమే ఆయన చెందుతారంటే ఆయనలో ఇన్ ట్రోజక్షన్ కు చెందిన లక్షణాలు కనిపిస్తాయి. అందుకని ఆయన ఇంట్రోజెక్షన్ కు మాత్రమే చెందుతారంటే ఆయనలో ప్రొజక్షన్ కు చెందిన లక్షణాలు కనిపిస్తాయి.

కనుక ఆయన రెంటికీ చెందుతాడనేది చెరగని సత్యం.

తనకంటే ఇతర్లు గొప్పవారున్నారని నమ్మినపుడు ఇతర్లలో తనను దర్శించటం జరుగుతుంది. ఇతర్లకంటే తాను గొప్పవాడు అని విశ్వసించినపుడు తనలో ఇతరులను తిలకించటం జరుగుతుంది.

ప్రపంచంలోని ప్రతి మానవుడిలో కూడ ఈ రెండు దృష్టులూ ఉంటాయి, సందేహం లేదు.

తనకంటే గొప్పవారుంటారు ఇతర్లలో కొన్ని సందర్భాల్లో, ఇతర్లకంటే తాను గొప్పవాడయి ఉంటాడు మరికొన్ని సందర్భాల్లో.

మొదటిదానిలో తాను హైన్యభావనను (Inferiority Complex) పొందుతాడు, రెండవదానిలో పొందుతాడు ఆధిక్య భావనను (Superiority Complex).

ఈ రెండూ కూడ డాక్టర్ రావుగారిలో మనకు దర్శనమిస్తాయి సందర్భారాన్ని బట్టి. ఇదే విధంగా సైకాలజీలో 'అంతర్ముఖి' (Introvert), బాహ్యముఖి (Extrovert) అనే రెండు పదాలున్నాయి. అంటే వీటికి చైతన్యవాది అనీ, భౌతికవాది అని వ్యాఖ్యానం చెప్పుకోవచ్చు.

ఒకరు, అతీంద్రియ గ్రాహ్యవిషయాలు మాత్రమే సత్యమైనవని విశ్వసిస్తే, రెండవవారు ఇంద్రియగ్రాహ్యాలు మాత్రమే సత్యమని విశ్వసిస్తారు.

కొందరుంటారు. ఈ రెండూ కూడ సత్యమని విశ్వసించేవారు. వీరినే అంటారు 'ఉభయముఖి' (Ambivert) అని. వీరి దృష్టిలో బాహ్యం ఎంత సత్యమో అంతర్జగత్తూ అంతే అని.

డాక్టర్ సదాశివరావ్ గారు ఉభయముఖి. ఆయనలో చైతన్యవాదం, భౌతికవాదం రెండూ ప్రత్యక్ష్యం.

బహిరంగ జగత్తును నిర్లక్ష్యం చేసే వారు కేవలం మిధ్యాజగత్తులో మాత్రమే నివసిస్తారు. అంతరంగ జగత్తును లెక్క చేయనివారు స్పందనలేని స్థూలజగత్తులో మాత్రమే శిలల వలె చలనం లేకుండా జీవిస్తారు. అందుకే కేవలం బహిర్ముఖులుగా గానీ, అంతర్ముఖులుగా గాని జీవించటం వాంఛనీయం కాదు, ఉభయముఖులుగా ఉండాలి.

బాహ్య అస్తిత్వం మిధ్యా కాదు, అంతర్ చైతన్యం కల్పనా కాదు. ఒకటి వస్తువులలోని వాస్తవం, రెండవది వ్యక్తిలోని ఒక వాస్తవం అవాస్తవమైనా జీవితమే అస్తిత్వాన్ని కోల్పోతుంది.

డాక్టర్ గారికి ఈ సత్యాసత్యాల మర్మము తెలుసు. కనుకనే ఆయన ఉభయముఖిగా ఉంటారు.

వైద్యాన్ని, వైదుష్యాన్ని, వస్తుధర్మాన్ని అర్థం చేసుకొన్నంత నిశితంగా జీవితాన్ని కూడ అర్థం చేసుకొన్న వ్యక్తి.

వీటన్నిటికంటే జీవితం ఎక్కువ విలువైందని ఆయనకు తెలుసు, కారణం ఇవన్నీ కూడ జీవితం నుండే ఉద్భవిస్తాయి, జీవితం నిమిత్తమే జీవిస్తాయి, జీవితం నిమిత్తమే క్రియాశీలమై ఉంటాయి కనుక.

వ్యక్తిత్వం లేనిదే వ్యక్తి కాలేడు, వ్యక్తి కానిదే మనిషి కాలేడు; మనిషికాని మనుషులు కూడా ఉంటారు.

కొందరు మామూలు వ్యక్తిత్వాన్ని మాత్రమే కలిగిఉంటే కొద్దిమంది అందుకు భిన్నమైన వ్యక్తిత్వాన్ని కలిగి ఉంటారు. అటువంటి భిన్నమైన వ్యక్తిత్వమే డాక్టర్ సదాశివరావు గారిది. ★

## సన్మిత్రులు "బాలబంధు"

- బి. వి. నరసింహారావు



మాన్యులు, మామక సౌజన్యమిత్రులు, డాక్టర్ కాసరనేని సదాశివరావుగారి షష్టిపూర్తి శుభసమయాన వారికి నేను అందించే అభినందన వచనాలు.

నాకు మరీ దగ్గరై. నన్ను తన అంతరంగ ఆవరణలోకి అభిమానంగా తీసుకొన్న డాక్టరు సదాశివరావుగారు అవిశ్రాంత కార్యోత్సాహి; తన అమృతహస్తంతో వైద్యసేవను ప్రజలందరికీ ఒక వరంగా అందిస్తున్న అసమాన వైద్యశిఖామణి. పదునైన కత్తివంటిది వారి మేధ. స్వచ్ఛందం, సువిశాలం వారి జీవితం.

తెలుగు సాహిత్యం అంటే అంతులేని అభిమానం వారికి. అందుకు నిదర్శనంగా గుంటూరు పట్టణంలో సాహితీ సదస్సు నొకదాన్ని నెలకొల్పి, అనేకమంది కవి పండితులను, శాస్త్ర కళావేత్తలను రావించి, వారి వైదుష్యాన్ని అభిమానులకు చవిచూపిస్తున్నారు.

మేమిద్దరం మాట్లాడుకునేటప్పుడు మా హృదయద్వారాలు ఇట్టే తెరుచుకుంటాయి. అప్రయత్నంగా, ఒకరి ఎదుట ఒకరిని నిలబెడతాయి. అవ్యాజంగా దాపరికాలు, గడుసుదనపు పోకడలు మామధ్య ఎన్నడూ పొడసూపవు. అకలంకమైన అంతరంగం కలవారికి దాచుకోవడాలుండవు. కాని హృదయాలను దోచుకోవడాలుంటాయి. అదే మా స్నేహం తీరు తీయం.

గద్దెపై, గరికపై, సమానరీవిలో, హోదాలో కూర్చోగల సౌజన్య సమభావం వారిది. అదే వారి ఉన్నతికి, ఉత్తమ జీవితపద్ధతికి ఒక చక్కని ఉదాహరణ.

గౌరవ భాజనులైన డాక్టరుగారు. 'ఇతరుల్లోని సుగుణాలను అన్వేషించండి, మీలోని అవగుణాలను పరిహరించుకొండి' అని తన అనుయాయులకు చెప్పడం కద్దు. 'వృత్తి ధర్మాన్ని పెంచుకొని ప్రేమానురాగ ప్రవృత్తిధర్మాన్ని నించుకొని, సమర్థవంతంగా ప్రజకు ఆరోగ్యాన్ని అవశ్యం అందించండి' అని చెప్పడం కద్దు.

అంతే కాదు "ఒరులు మీ కొనర్చిన అపకారాలను విస్మరించండి. ఒరులు మీ కొనర్చిన ఉపకారాలను పాలరాతి ఫలకాలమీద చెక్కించుకొని సదా స్మరించండి" అని చెప్పే వారి సతీహిత వచనాలు.

రాజకీయాలు చేపట్టి, ఉన్నత పదవుల నధిష్టించడం వారికి అవసరమని నేను భావించాను. ఎందుకంటే వారొక జ్ఞాన విజ్ఞాన సర్వస్వం. వారికి విద్యావైద్య రాజకీయాల్లో అపారమైన అవగాహన ఉంది. వాటికి లోకం ఎప్పుడూ పట్టం కడుతుంది.

వారి సలహాలు అన్ని తరాలతరహాల వారికీ అందుతూనే వుంటాయి. అలాంటప్పుడు వారు సింహపీఠి పైకి ఎగబ్రాకవలసిన అవసరం ఎందుకు కలుగుతుంది?

వారి ప్రజాసేవకు పారం లేదు. పదవీ వ్యామోహంతో వారికి పనిలేదు. ఇది తెలియనివారు కొందరు వారికి, ఎలక్షనులో ఓడినప్పుడూ, గెలిచినప్పుడూ ఒకేవిధంగా సానుభూతి నందించగా, నేను బైటికే నవ్వాను. వారు లోలోపల నవ్వుకున్నారు.

డాక్టర్ సదాశివరావుగారికి వారి సతీమణి డాక్టరు జయప్రదాంబ వృత్తిలో, ప్రవృత్తిలో గొప్ప ఆలంబనం అవసరమైన బలం. ఆ సంగతి నేను బాగా ఎరుగుదును.

అందరూ డాక్టర్లయిన గృహం వారి దొక్కటే.

డాక్టరు సాబ్ మంచిచెడ్డలను బేరీజు వేయగల సమర్థులు. విలువలను తూచితూచి వెలగట్టగల సమర్థులు. సరసత, సామెత, చతురత వెలార్చగల దిట్ట. ఆకాశమండపం ఆయన మందిరాంతం. వారి జీవితమొక సుందరకావ్యం. అనేక ప్రతిభా పాటవాలు తనలో నిండించుకొని, బ్రతుకును పండించుకొన్న ధన్యులు వారు.

వారి జీవితం జ్ఞానప్రదీపితం, కర్మాచరణ ప్రబోధితం. ఔన్నత్యం గాంభీర్యం, ప్రయత్నం, ప్రయోగం, వైవిధ్యం వైదుష్యం వారికి గుర్రపుస్వారి వంటిది.

ఆయన అనుష్ఠానం అచంచలం. అది ధర్మబద్ధం. అందుచే డాక్టరు గారంటే అందరికీ అంత మంచి మనసు; గొప్ప గౌరవం.



## ఆదర్శజీవి

- "పండిత" శ్రీ చిన్నము రామయ్య చౌదరి

సుమారు నలుబదేళ్ల కిందటి మాట. నేను దుగ్గిరాల జిల్లా బోర్డు హైస్కూలులో తెలుగుపండితుడుగా నున్నపుడు డాక్టరు సదాశివరావుగారిది గుంటూరు సమీపములోని తక్కెళ్ళపాడనీ, విద్యార్థిగా చురుకైనవాడనీ, సమర్థుడైన డాక్టరనీ ప్రజలు చెప్పుకొను చుండగా శ్రుతి పరంపరగా విన్నాను.

వరకట్నాలు పెద్దమొత్తాలలో ఈయగల కన్యాదాత అప్పటికే సిద్ధమైనా, డాక్టరు గారు డబ్బు అవసరమైన కుటుంబములో పుట్టి పెరిగినవాడైనా కట్నమున కాశింపకుండ జయప్రదాంబ గారిని వివాహమాడి యువ విద్యాధికులందరికీ ఆదర్శప్రాయుడై చక్కని చరిత్రను సృష్టించుకొన్నారని ప్రజలు చెప్పుకొనెడివారు. నా జన్మస్థలమైన ఉంగుటూరికి, తక్కెళ్ళపాటికీ సంబంధ బాంధవ్యాలు ఎక్కువగా ఉన్నందువలన వారిని గూర్చిన విశేషాలు తరచుగా వినబడుచుండెడివి.

1960 సం॥ర ప్రాంతములో డాక్టరు గారిని ప్రత్యక్షముగా చూచుట తటస్థించినది. చూడక పూర్వము నా భావనలో బక్కపలుచని శరీరముతో ఒడ్డు పొడవులు సమపాళ్ళలో గల వ్యక్తిగా ఆయన రూపమును ముద్రించుకొన్నాను. చూచిన తర్వాతగూడ శరీరములో కొంచెము దళసరితనము తప్ప మరేమీ మార్పు కన్పింపలేదు.

లోకములో కొందరి పేర్లుగాని, చరిత్ర గాని విన్నపుడు వారివారి ఆకారములు మనసులో ఒకరకముగా ముద్రపడి చూచినపుడింకొక రకముగా కన్పించుట జరుగును. సదాశివరావుగారి విషయంలో అట్లు జరుగలేదు.

పైపెచ్చు, అప్పుడాయన చూపిన ఆదరాభిమానములు సాహితీప్రియ భావుకతకు ప్రతీకలుగా భాసించి కీ.శే. ఆవుల గోపాలకృష్ణమూర్తి గారిని స్మృతికి దెచ్చి నన్ను స్పందింప జేసినవి.

"దానాది ప్రభవాకీర్తిః శౌర్యాది ప్రభవం యశః" అని పండితులు కీర్తియశస్సుల స్వరూపములను వేర్వేరుగా నిర్వచించినారు. పెద్దలు సంపాదించి యిచ్చిన ఆస్తిపాస్తులతో దానధర్మములు చేసి కీర్తి సంపాదించుట దుష్కరమైన పనిగాదు. స్వీయశక్తి సామర్థ్యములను ప్రదర్శించి తనదైన వ్యక్తిత్వముతో పవిత్రచరిత్రను సృష్టించుకొని యశస్సు నార్జించుట దుష్కర కార్యము. సదాశివరావుగారి వ్యక్తిత్వ మంతా ఆయన సామర్థ్యముపై నాధారపడి, ప్రాణములు పోసికొన్నదే గాని పరుల ప్రాకముపై నాధారపడి జీవములు నిలుపుకొన్నది గాదు.

వివేకము, స్వయంకృషి, సామర్థ్యము మున్నగునవి వ్యక్తుల శక్తులకు వన్నెపెట్టెడి సానరాళ్ళు. అనుశీలనము, వివేచనము మున్నగునవి సామర్థ్యములను మరింత ప్రోది చేసెడి సదభ్యాసములు. డాక్టరు గారిలో ఈ లక్షణములు చాలవరకు మూర్తి కట్టి నిలిచినవి. ఆ కారణముననే ఆయన తన అభిరుచులకు ప్రతీకలుగా 'ప్రజా వైద్యశాల'ను సాహితీ సదస్సును స్థాపించినారు. జె. కె. సి. కళాశాలకు కార్యదర్శిగా సారధ్యము వహించినారు. తుదకు రాజకీయరంగ ప్రవేశము కూడా చేసినారు.

"అతి సమర్థులకిల నసాధ్యంబు లేదు" అన్న పెద్దల మాటకు దీటుగా సదాశివరావు గారు వైద్యవృత్తిలో గొప్ప పేరుప్రఖ్యాతులు సంపాదించి ప్రముఖవైద్యులలో నొకరుగా భాసించినారు. విద్యార్థి దశను స్మృతికి దెచ్చుకొనుచు

విద్యార్థులకు పరీక్ష ఫీజు తీసికొనకుండ రోగనిర్ణయము చేసి సహాయపడుచు, వైద్యవృత్తికే వన్నె వాసులు కల్పించినారు. చికిత్సా విధానములో పేదవారి నొక కంట కనిపెట్టి పెరటి కల్పకముగా వారి నాదుకొనుట కలవాటు పడినారు. డాక్టరుగారు లబ్ధప్రతిష్ఠులుగా చరిత్రలో ముద్ర వేసి కొన్నారు.

ఇటీవల ఆయన అమెరికా దర్శించినపుడచటి వైద్యనిపుణులు చేయు శస్త్రచికిత్సా విధానములోని క్రొత్త పద్ధతులను గమనించి తన అభిరుచులకు వన్నె కల్పించుకొన్నట్లు విన్నాను. "నిశ్చితార్థంబు వదలరు నిపుణమంతులు" అన్న పెద్దల సూక్తి డాక్టరు గారి యెడ సార్థకమైనది.

నిరంతరామశీలనమును, వివేచనమును ప్రధాన సాధనములుగా స్వీకరించి సాహితీ పిపాసువులైన ఆంధ్రాంగ్ల సారస్వతముల నవగాహనము చేసికొన్నారు. సారస్వతేయుల కండదండగా నిలిచి సాహితీ సదస్సును స్థాపించినారు. ఉద్దండ పండితులను, కవులను, మహోపన్యాసకులను రావించి, వారి బోధలను, కవితా గానములను, సాహితీ ప్రియులందరకు వినిపించి సదస్సును చరితార్థము కావించినారు. ఉత్తమ కవుల నాదరించి వారి కృతులను స్వీకరించి, పండితుల నాదరించి సాహితీ పోషకుడుగా, అభిమానిగా పేరెన్నిక గన్నారు.

జె. కె. సి. కళాశాల స్థాపనలో కార్యదర్శిగా సారధ్యము వహించి, అధ్యాపకులను నిర్ణయించుకొనుటలో ఉత్తమ సంప్రదాయములను పాటించి, క్రమశిక్షణ కగ్రస్థానము కల్పించి సర్వాతిశాయిగా, అభిమానముతో, వాత్సల్యముతో పట్టు విడుపులు ప్రాతిపదికలుగా ఆ సంస్థను నిర్వహించి తన వ్యక్తిత్వమును నిరూపించుకొన్నారు. అచిరకాలముననే జె. కె. సి. కళాశాలను శ్రేణి కళాశాలల పంక్తిలో సధిష్ఠింపజేసినారు.

ఇంతవరకూ ఆయన జీవితము త్రివేణీ సంగమముగా రూపొంది పవిత్రముగా భాసించినది. ఆయన వలన సంస్థలకూ, సంస్థలవలన ఆయనకూ "మణినా వలయం మణిః" అన్నట్లు పరస్పర శోభ చేకూరగా, ఆదర్శజీవిగా ప్రశంసల నందుకొన్నారు.

అన్నదాతలు, అమాయకులు, కష్టజీవులునైన రైతులోకము ఆయన నాకట్టు కొన్నంతగా లోకములో ఇంకేదీ ఆకట్టుకోలేదు. తన వ్యక్తిత్వపు ముద్ర చెడకుండా, అవినీతిని కుళ్ళగించి వెలుగుబాటలను వెలయింప వలెనను తహతహతో రైతులోకము కోసము రాజకీయరంగ ప్రవేశము చేసినారు. నేటి సమాజములో ఆయన ఎంతవరకు కృతకృత్యుడు కాగలడో! వేచిచూడవలసి యున్నది. భగవంతుడాయనకు అక్షీణ దీక్షాబలము చేకూర్చి ధన్యజీవనము ప్రసాదింపగలడని ఆశించుచూ, ఆశీర్వదించుచూ సెలవు : ★

"వాని జన్మంబు సఫల మెవ్వాని వలన వంశ మధికోన్నతి వహించి వన్నె కెక్కు"

## డాక్టరుగారితో నా పరిచయం

- పాతూరి కోటేశ్వరరావు

ఆ రోజు గురువారం. జూలై 1968. సమయం రాత్రి 10–30 గంటలు. నేను చిలకలూరిపేట కాలేజీలో ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తూ మా ఊరికి తిరిగి వెళ్ళడానికి నా గురువర్యులైన బ్రహ్మయ్యగారు, కృష్ణానందం గారితో కలిసి వారి కార్యార్థమై గుంటూరు చేరాము. భోజనానంతరం రిక్షాలలో బయలుదేరి లక్ష్మీపురం, 2వ లైను చేరి ఒక యింటి వద్ద ఆగాము. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అయినా మేడమీద వరండాలో లైటు చూసి మా గురువు గారు తమ రాక వ్యర్థం కాలేదని సంతృప్తి చెందారు. రిక్షాలు పంపించి అందరం పైకి వెళ్ళాం. ఒక గంభీరమైన వ్యక్తి పడక కుర్చీలో పండుకొని పుస్తకపఠనంలో నిమగ్నమై ఉన్నారు. మేము అభివాదం చేసిన తరువాత "హలో బ్రహ్మయ్యా, ఏమిటి ప్రిన్సిపల్ గా చేరావా అక్కడ? ఇక్కడకు రావడం లేదా" అని ఆత్రుతగా అడిగారు. ఆయన సమాధానం అయిపోయిన తరువాత నావైపు చూచి "ఈ అబ్బాయి ఎవరు?" అని అడిగారు. మా గురువుగారు నన్ను పరిచయంచేసి చిలకలూరిపేటలో లెక్చరర్ ఉద్యోగానికి ప్రయత్నం చేస్తున్నాడని వివరించారు. వెంటనే "మా కాలేజికి అప్లై చేశావా? ఇక్కడ ఉద్యోగమిస్తే వస్తావా?" అని నన్ను సూటిగా ప్రశ్నించారు. ఈ ప్రశ్న నేనూహించనిది.

ఉద్యోగం కోసం శతవిధాలుగా ప్రయత్నం చేసే అప్పటి పరిస్థితులలో తనకు తానుగా ఏమీ పరిచయంలేని వ్యక్తికి ఉద్యోగం యివ్వడం సాధ్యమా అంటే, సాధ్యమేనని నిరూపించారు ఆ మహనీయులు. వారే మా డాక్టరు కాసరనేని సదాశివరావుగారు. నా గురువర్యు లిద్దరు ఆ సంఘటనకు ఆశ్చర్యభరితులై "ఏం శిష్యా, డాక్టరు గారిని ఏదో హిప్నటైజ్ చేసి ఉద్యోగం కొట్టేశావే!" అని బయటికి వచ్చిన తరువాత నన్ను ఎంతో ఆత్మీయంగా అభినందించారు.

నా జీవితంలో ఆనాటి సంఘటన ఒక చిత్రమైన మలుపు. ఎందుకంటే నేను వెనుకబడిన ప్రాంతమైన ఒక పల్లెటూరు నందు పేద కుటుంబంలో పుట్టాను. మా కుటుంబంలో ఎవరూ అక్షరాస్యులు లేరు. ఆర్థికంగా ఎన్నో యిబ్బందులకు గురై చదివిన చదువుకు ప్రయోజకత చేకూరుతుందా? ఉద్యోగం పలుకుబడి లేకుండా సంపాదించ గలమా ? అనేవి నన్ను నిరంతరం వేధించే ప్రశ్నలు. ఈ ప్రశ్నలు అన్నింటికి ఒకే ఒక్క చూపులో సమాధానం చెప్పిన ఆ మహా మనీషి మా డాక్టరు సదాశివరావు గారు.

డాక్టరు గారి జీవితంతో నా జీవితాన్ని పోల్చను గాని, నా మలి పరిచయంలో వారు నన్నడిగిన ప్రశ్నలను బట్టి, నా గురించి వారి సన్నిహితులతో చెప్పిన మాటలను బట్టి, ఏదో సారూప్యమున్నట్లు నేను భావించాను. వారు కూడా చిన్నతనంలో కష్టపడి విద్యాభ్యాసం చేసినట్లు వారి సన్నిహిత మిత్రులు శ్రీమన్నారాయణ గారు చెప్తూ వుంటారు. డాక్టరుగారు కూడా ఆయా సందర్భాలలో గత స్మృతులను నెమరు వేసుకుంటూ ఆ ఆనందాన్ని అందరికీ పంచుతూ వుంటారు. హైస్కూలు జీవితంలో ఒక రోజు ధోవతి కట్టుకొని వస్తే వారి హెడ్మాష్టరు, బుద్ధిరాజు రామచంద్రరావుగారు విరామ సమయంలో పిలిపించి దానిని సరిచేసిన సంగతి యిప్పటికి వివరిస్తూ వుంటారు. డాక్టరు గారిలో నన్ను ప్రత్యేకంగా ఆకర్షించిన అంశం వారి ఆత్మీయత, నిరాడంబరత. నీరుకాయ బట్టలు కట్టినా, టెరికాటన్ వేసినా వారి ఆప్యాయతలో, ఆత్మీయతలో భేదం కనిపించనే కనిపించదు. అంత ఉన్నత స్థితిలో నున్న వ్యక్తి, ప్రఖ్యాతిగాంచిన డాక్టరు సామాన్యుడితో చనువుగా మాట్లాడడం లోకవృత్తికి భిన్నంగా నున్నట్లు కనిపించేది. కాని అది

వాస్తవం. డాక్టరు గారితో పరిచయమైన తరువాత వారి అలవాట్లు చూసి చాలా ఆశ్చర్య పడ్డాను. పఠనా వ్యాసంగం, సాహిత్యాభిలాష, విద్యావిషయాలపై ఆసక్తి, రాజకీయాలపై అభిరుచి, యిలా ఎన్నో సద్గుణాలు.

పల్లె ప్రాంతాల నుండి వచ్చిన వారంటే డాక్టరుగారికి ప్రత్యేకమైన గౌరవం. కాలేజీలో తాను ఇచ్చిన ఉద్యోగాలు దాదాపు తొంభై శాతం పల్లెటూరి నుండి వచ్చిన వారికే. పనిలో వారు ఒళ్లు దాచుకోరని ఆయన విశ్వాసం. జె.కె.సి. కాలేజి ఈనాటి ప్రగతికి వారి నిర్ణయమే మూలకారణం. తొలిరోజుల్లో సాయంత్రం వేళల్లో కాలేజికి వచ్చి మాలో ఒకరుగా కాలం గడిపేవారు. ఇంటికి బయలు దేరే వేళ కాగానే ఆ 6336 కారు పుష్పక విమానంలా మారేది. ఆరు నుండి తొమ్మిది మంది దాకా ఎక్కించుకొని గుంటూరు చేరేది. అప్పుడప్పుడూ సరదాగా సైకిల్ త్రొక్కుతూ కూడా వచ్చేవారు.

నేను చదువుకున్నది విజ్ఞానశాస్త్రమైనా, నాలో సాహిత్యాభిమానం డాక్టరుగారి పరిచయం వల్ల పెరిగింది. వారు నడిపే "సాహితీ సదస్సు" కార్యక్రమాలు ఆనందవికాసాలకు మార్గదర్శక మయ్యాయి. ఆంధ్రదేశంలో నిష్ణాతులైన కవులను, సాహితీమూర్తులను చూచే సద్భాగ్యం వారు మాకు కల్పించారు. పూర్వతరానికి చెందిన కవివృద్ధులను, **"చిన్నయసూరి సంస్మరణ"** పేరిట మా కళాశాలకు పిలిపించి సాహిత్యాభిమానమున్న వారందరికీ ఆనంద పారవశ్యత కల్పించారు.

ఆనాడు ఆ కవిపుంగవులను దుశ్శాలువలతో సత్కరిస్తున్న మా డాక్టరుగారి ఆనందం వర్ణనాతీతం. వీరి అభిరుచికి అనుగుణంగా మా వ్యవస్థాపక ప్రిన్సిపాల్ ఎలవర్తి రోశయ్య గారు కళాశాల గ్రంథాలయాన్ని సద్గ్రంథాలతో ఒక విశిష్ఠ విభాగంగా నెలకొల్పి పలువురు గొప్ప వ్యక్తుల ప్రశంసలు పొందారు.

డాక్టరుగారు పేదరికాన్ని పాపంగా గాక సంఘం పెట్టిన శాపంగా భావించే విశాల హృదయులు. విద్యార్థులను పితృప్రేమతో లాలించి వైద్యం చేసే ప్రేమమూర్తి. తన సంస్థలలో పనిచేసే ఉద్యోగులను సమభావంతో చూడకలిగిన ఆదర్శమూర్తి. తన మీద నాలుగు మొక్కలు పెరగాలనుకునే సౌజన్యమూర్తి, తన విద్యార్థుల ఉన్నతిని చూచి గర్వించే సాధుమూర్తి. తన గురువుల యెడ భక్తి భావాన్ని ప్రదర్శించుకునే పుణ్యమూర్తి.

మానవులలో మహోన్నతులై షష్టి పూర్తి జరుపుకుంటున్న డాక్టర్ సదాశివరావుగారు సహస్ర చంద్రదర్శనోత్సవం జరుపుకోవాలని ఇంకెన్నో ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహించాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను. ★

"కవిని గన్న తల్లి గర్భమ్ము ధన్యమ్ము
కృతిని జెందువాఁడు మృతుఁడు గాడు" –జాషువా

## మా గురుదేవులు

- డాక్టర్ ఎస్. కె. హరనాథబాబు రెడ్డి

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః..." అని ప్రాచీనులు సమాజంలో ఆచార్యుడికి అత్యున్నతస్థానం కల్పించి, ఆరాధించారు. అలా ఆరాధింప దగ్గ దేశికులు ఆనాడే కాదు, నేడు కూడా అలరారుతున్నారు. అటువంటి వారిలో అగ్రగణ్యులు మా గురువర్యులు డాక్టర్ కాసరనేని సదాశివరావుగారు.

డాక్టరు సదాశివరావుగారు శిష్యజీవన వెలుగు పథంలో వాకలు, వెల్లిగొలిపే మహనీయులు.

*గుశబ్ద స్త్వంధకారే స్యాత్*
*రుశబ్ద స్తన్నిరోధకః*

*అంధకార నిరోధిత్వాత్*
*గురు రిత్యభిధీయతే*

అన్న అభిభాషణానికి అక్షర నిదర్శనం మా గురువుగారు. మా గురువర్యులు మాకు వైద్యశాస్త్ర వివేకంతో పాటు లోకాలోకాన్ని కూడా అందించారు. ఈ దేశకోశ పరిశీలనమే కవచం! మాకు వజ్రకవచం.

మా గురువుగారు కేవలం గుణపక్ష పాతి. తదితర సంకుచితభావాలకు వారి మనస్సులో స్థానం లేదు. ఆయన సరసహృదయుడు. నిరంతర సారస్వత పిపాసువు. ఆయన వాక్కు సంస్కార క్రమసంపన్నం, కల్యాణకరం, మనోహరం. ఆయన ప్రవృత్తి కదిలేది. కదిలించేది, పెనునిద్దుర వదిలించేది, మునుముందుకు సాగించేది, పరిపూర్ణపు బ్రతుకిచ్చేది.' అందుకే ఆయన మంచి మనిషి!

*మహామనీషి! మానవోత్తముడు!*
*తెలుగు ప్రజ గుర్తించింది వారి తత్వాన్ని,*
*ప్రసాదించింది శాసనసభ్యుడయ్యే సత్వాన్ని,*
*ఇది మాకు ఆనందదాయకం. దానికి తోడు నేటి విశేషం!*

సదాశయులైన సదాశివరావుగారు, జులై 5, 6, 7 తేదీలలో కాలిఫోర్నియాలో నిర్వహింపబడిన ఉత్తర అమెరికా తెలుగు సంఘం ఐదవ వార్షిక మహాసభలో పాల్గొని, అమెరికా, ఇంగ్లాండు మొదలైన దేశాల్లో రెండుమాసాలు పర్యటించి, ఆయాదేశాలలోని విశ్వవిద్యాలయాలను, వైద్య పరిశోధనాలయాలను సందర్శించి, విదేశాలలో వారు సముపార్జించిన విజ్ఞానం ప్రజాశ్రేయస్సుకు దోహదం చేస్తుందని విశ్వసిస్తున్నాను. మా గురువర్యులు మరింతగా వైద్యదీపకళికలను వెలిగించాలని ఆకాంక్షిస్తూ వారి షష్టి పూర్తి మహోత్సవ సందర్భమున నా అభినందన పూర్వకాభివందనాలు. ★

## మా డాక్టరుగారు - డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్



డాక్టరు సదాశివరావుగారు నాకు ఏ విధమయిన శస్త్రచికిత్స చెయ్యలేదు. కనీసం ఏనాడూ నా చెయ్యిపట్టుకుని 'నాడి' చూడలేదు. కాని, నా 'నాడి' ఆయనకు తెలుసు. అందుకే 'మా డాక్టరు గారు' అన్నాను, అంటున్నాను, అంటాను.

డాక్టర్ సదాశివరావుగారిని గూర్చి చిన్న వ్యాసం పంపమన్నారు. ఎలా సాధ్యం? డాక్టరుగారిని గురించి చిన్నవ్యాసంలో ఎలా తెలపాలి? సాగరమంత లోతూ, హిమాలయాలంత ఉన్నతమూ అయిన వ్యక్తిత్వాన్ని చిన్నగా ఎలా చిత్రించాలి ? సాగరాన్ని గాగరం (కుండ) లో నింపగల బిహారిలాల్ కున్న ప్రజ్ఞ లేశమాత్రమయినా నాకు లేదు? ఎలా అయినా అభ్యర్ధనను కాదనలేక కొండను అద్దములో చూపించే ప్రయత్నం చేస్తున్నాను.

డాక్టరుగారు చాలా ఉన్నతులని, ఎందరికో ఎన్నో విధాల సాయపడ్డారని మిత్రులు కొందరు చెప్పగా విన్నాను. అయితే ఆయనతో కలిసి అమెరికాలో పర్యటిస్తున్నప్పుడు ఆయన వద్ద ఎన్నోరకాల సహాయాలు పొందిన ఆయన విద్యార్థులను చూచిన తర్వాత ఆయన చేసిన ఎన్నో సహాయాల గురించి ఆ విద్యార్థులు చెప్పిన మాటలను విన్న తర్వాత, డాక్టరు గారి పట్ల వారి అవ్యాజానురాగాలను వీక్షించిన పిమ్మట నాకు 'నార్ల వారి మాట' జ్ఞప్తికి వచ్చింది :

*చేతనైన మేలు, చేతనైన వరకు*
*చేతనైన రీతి చేసి కూడ*
*చెప్పుకొనని వాడి గొప్పవాడన జెల్లు*
*నవయుగాల బాట నార్ల మాట!* –

డాక్టరుగారు నిరంతర విద్యార్థి. ఎప్పుడూ ఏవో కొత్త విషయాలు తెలుసుకుందామనే తపన, దానికి వలసిన ప్రయత్నం నిత్యం ఆయనలో మనం చూడవచ్చు. ఎవరైనా డాక్టరుగారు 'తనవాడు' అని అనుకుంటే, వారికోసం ఆయన ఎంతటి శ్రమపడటానికైనా వెనుదీయరు. వారికోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడటం ఆయన విలక్షణత.

నాలో డాక్టరుగారిని గురించి ఇంకా ఏదో వ్రాయాలనే భావసంచలనం మస్తిష్కములో తిరిగే అవ్యక్త భావన, ఆధునికాంధ్ర కవిదిగ్గ జాలలో ఒకడైన **ఆలూరి బైరాగి**కి ఎదురైన 'కవి సమస్యే' ప్రస్తుతం నన్ను పట్టుకుంది.

## సౌజన్యమూర్తి

- వేగుంట కనకరామబ్రహ్మం

"When You are good to others You are best to yourself".-Franklin

బహు నిండయిన వ్యక్తి. ఇంకా నిండైన విశాల హృదయం. ఆ విశాలహృదయంలో ఎందరెందరికో స్థానం ఎంత మందిలో వున్నా, "ఎవరా యీ వ్యక్తి! " అనిపించే Personality, సౌజన్యం తొణికిసలాడే వదనం, వెలుగును వెదజల్లే కళ్ళు, నవ్య నవనీతం వంటి మనస్సు, మల్లెపూవు లాంటి శీలము. ఆయనే డాక్టరు సదాశివరావు. ఎరిగిన వారందరికీ నా వాడే. వైద్యరంగంలో ఆయన్ను ఎరుగనివారు లేరు. వైద్యుడుగా లబ్ధప్రతిష్ఠుడు.

గుంటూరులో వీరి "పీపుల్సు నర్శింగు హోమ్" పేరును సార్ధకం చేసుకుంటుంది. వీరూ, వీరి శ్రీమతి డాక్టరు జయప్రదాంబ చేసిన, చేయుచున్న వైద్యసేవ అపారము. వీరిరువురు విసుగు, విరామం లేకుండా, పగలు రాత్రి చూడకుండా రోగుల విషయంలో ఎంతో శ్రద్ధ చూపుతారు. వారి కుటుంబ సభ్యులంతా డాక్టర్లు కావటం ఒక విశేషం.

సదాశివరావుగారు వైద్యరంగంలో అనేక హోదాలలో ఎన్నో విధాల ప్రజాసేవ చేస్తూ అందరి మన్ననలను అందుకున్నారు. సౌభ్రాత్రం, సౌమనస్యం సర్వమానవ లోకంలో వెల్లివిరియటం సాధ్యమేనని నిరూపించిన మానవతామూర్తి డాక్టరుగారు.

18 సంవత్సరాల క్రితం ఒక పండుగరోజున సోదరులు సంజీవదేవ్ గారి యింట సదాశివరావు దంపతులతో సాహితీ గోష్టులతో గడిపి నిజమయిన పండుగగా ఆనందించాము. ఆ రోజు వారితో బాటు అప్పుడప్పుడు కీ॥ శే. ఆషా కూడా వుంది. గుంటూరు వెళ్ళినప్పుడు రెండు మూడు పర్యాయములు వారికి అతిథిగా వున్నాను. అతిథి మర్యాదలకు ఆ దంపతులు పెట్టింది పేరు. చిన్న, పెద్ద, కొత్త, పాత తేడాలు లేకుండా అందరినీ ఒక్కలాగే ఆదరించి గౌరవిస్తారు జయప్రదాంబగారు. స్వయంగా వడ్డన చేస్తుంటే "అన్నపూర్ణకు నుద్దియౌనట్టి గృహిణి" అన్న పెద్దనగారి మాట గుర్తుకొస్తుంది. అప్పుడు ఆమెను ఎవరూ డాక్టరు అనుకోరు. మర్యాద ఆమె సొత్తు;

డాక్టరుగారు దయాదాక్షిణ్యాలు కలవారని, అమృతహస్తుడని ప్రతీతి. గర్వం అన్నమాట వారి నిఘంటువులో లేదు. ఆదరణ ఆయన ఆశయం. ఉన్నవారు, లేనివారు కూడా వీరి ఆస్పత్రికి అసంఖ్యాకంగా రావటం వల్ల వీరికి బొత్తిగా తీరుబడి ఉండదు. అయినా దీనితోనే సరిపెట్టుకోక విద్యాసంస్థలతో, సాంఘికసంక్షేమ సంస్థలతో, సాహిత్య సంస్థలతో సంబంధం పెట్టుకుంటూ సేవ చేస్తూ వుంటారు. గుంటూరు జె. కె. సి. కాలేజీ అభివృద్ధికి కార్యదర్శి, కరస్పాండెంటుగా చేసిన సేవ అనల్పం. ఎంతో మంది బాల బాలికలకు విద్యావసతులు కల్పించటంలో, వారి యెడల వాత్సల్యం చూపడంలో డాక్టరుగారి సేవా పరాయణత ద్యోతకమవుతుంది.

గుంటూరులో దాదాపు రెండు దశాబ్దాల నుండి "సాహితీ సదస్సు" ను వీరు చక్కగా నడుపుచున్నారు. యీ సమావేశాలు సాధారణంగా ప్రతినెల ఆఖరి ఆదివారం తమ యింట్లోగాని, ఆహ్వానించిన వారి ఇంటిలోగాని జరుగుతూ వుంటవి. సాహిత్యం, లలితకళలు, వైజ్ఞానిక విషయాలు మొదలగు అంశములపై ఆయా రంగాలలో నిష్ణాతులను రావించి ప్రసంగాలు చేయించుతూ ఉంటారు. కవితాగానం కూడా ఆ సదస్సులో ఉంటుంది. ఆ సదస్సు అధ్యక్షులు సదాశివరావుగారే. వీరికి సాహిత్యాభిమానం, లలితకళలపై మక్కువ. కవి, పండితులపై, కళాకారులపై అనురాగం చాలా ఎక్కువ.

డాక్టరుగారు ప్రత్యేక గ్రంథరచన ఏదీ చేయనప్పటికీ వ్యాసాలు, ప్రసంగాలు ఉంటూనే ఉంటాయి. రేడియోలో కూడా అప్పుడప్పుడు ప్రసంగిస్తూ ఉంటారు. సాహిత్య సభలకు వారిని అధ్యక్షులుగా పెట్టుకోవటం సభకు ఒక గౌరవంగా బావిస్తారు ప్రతివారు కూడా. వారికి మంచి స్వంత గ్రంథాలయం వుంది.

ఈ మధ్య రాజకీయాలలో ఆసక్తికరంగా పాల్గొంటున్నారు. ప్రజల కోరికపై యీ సంవత్సరం జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో శాసనసభ్యులుగా ఎన్నుకోబడటం ఆయన పట్ల ప్రజలకున్న విశ్వాసానికి ప్రబల తార్కాణం. అమాత్యపదవి తప్పక లభించగలదని అందరూ ఆశించారు. కాని ఆశించిన విధంగా జరుగలేదు. ఆ నష్టం రాష్ట్ర ప్రభుత్వానికే కాని, ఆయనకు కాదంటే అతిశయోక్తి కాదు.

కొద్దికాలం క్రితం డాక్టరు గారు ఇంగ్లండు, అమెరికా, తదితర, అభివృద్ధి చెందిన దేశాలలో దాదాపు రెండునెలల పాటు పర్యటించి ఆయా దేశాలలో విశ్వవిద్యాలయాలను, సేవాసంస్థలను సందర్శించి మంచి అనుభవంతో తిరిగివచ్చారు. వారి సేవలను, విజ్ఞానాన్ని, అనుభవాన్ని ప్రభుత్వంవారు చక్కగా వినియోగించుకొని మన రాష్ట్రమునకు మేలు చేయుదురు గాక! డాక్టరు గారు ఆయురారోగ్యములతో కలకాలం వర్థిల్లుదురుగాక! అని వారి షష్టి పూర్త్యుత్సవ సందర్భమున నా హృదయ పూర్వక శుభాకాంక్షలు. ★

## మనీషి

– పి. జగదీశ్వరరావు. M. A. LL. B.

ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ వైద్యశాస్త్ర విశారదులలో డాక్టరు కాసరనేని సదాశివరావుగారు ప్రముఖులు. ఆయన స్ఫురద్రూపి. ఆకారసదృశ ప్రజ్ఞాశాలి. ఎంతటి మేధావియో అంతటి శాంత స్వభావుడు. బంగారానికి తావి అబ్బినట్లు డాక్టరు జయప్రదాంబ వారి శ్రీమతియై డాక్టరు గారి బహుముఖప్రజ్ఞకు ఎంతో దోహదం చేసింది. వీరి కుటుంబ సభ్యులంతా వైద్యవృత్తిలో పేరుగాంచుట ప్రశంసనీయం. ఎదుటివారిని నొప్పించక మెప్పించే రీతిలో మాట్లాడటం డాక్టరు గారికి వెన్నతో బెట్టిన విద్య.

గుంటూరులోని జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల వ్యవస్థాపక కార్యదర్శిగా, ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనెటు సభ్యులుగా, నాగార్జున యూనివర్శిటీ సిండికేటు సభ్యులుగా, డాక్టరుగారు విద్యారంగానికి ఎంతో కృషిచేశారు. ఏదేని ఒక సమస్య వచ్చినపుడు దాన్ని అన్ని కోణాలనుంచి సమగ్రంగా సమన్వయ దృష్టితో పరిశీలించి అందరికీ అనుకూలంగా పరిష్కరించటం వారి బుద్ధి నైశిత్యానికి తార్కాణం.

డాక్టరుగారు సవ్యసాచి లాంటివారు. చక్కని వక్త, మంచి సాహితీవేత్త. గుంటూరులో సాహితీ సదస్సును స్థాపించి పలువురు కవి పండితులను గౌరవించారు. అనేక సాహిత్యగ్రంథాల ఆవిష్కరణకు హేతుభూతులయ్యారు. "కలలో కవిత" వంటి గ్రంథాలకు కృతిభర్తయై సాహితీ ప్రియంభావుకులనే పేరు పొందారు. డాక్టరుగారి మేధస్సు పాదరసం లాంటిది. రాజకీయాలలో వారు అనేక అనుభవాలను చవిచూచారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులుగా ఆదర్శ జీవితాన్ని సాగిస్తున్నారు.

కాలిఫోర్నియాలో జరిగిన ఉత్తర అమెరికా తెలుగు సంఘము వార్షిక మహాసభలలో పాల్గొని అమెరికా, ఇంగ్లండు, దేశాలలో దిగ్విజయంగా పర్యటించి ఆయా దేశాలలోని వివిధ విశ్వవిద్యాలయ వైద్యశాస్త్ర పరిశోధనాలయాలను పరిశీలించిరి. డాక్టరు సదాశివరావుగారి షష్టి పూర్తి సందర్భమున నా హృదయపూర్వకాభి వందనములు. ★

## తోడు – నీడ

- జొన్నలగడ్డ రామారావు

అమెరికా కనుగొని తిరిగి వచ్చిన కొలంబస్ గౌరవార్ధము స్పెయిన్ మహారాజు గొప్పవిందు ఏర్పాటు చేశాడు. ఆ ఆహుతులలో కొందరు తమ అసూయాద్వేషములను కొంటెమాటలతో కొలంబస్ వినునట్లుగా వెలిబుచ్చారు. కొలంబస్ కు కోపం వచ్చి, ‘ మీలో ఎవరైనా కోడిగుడ్డును బల్లపై నిలబెట్టగలరా?’ యని అడిగెను. వారిలో ఎవరూ చేతకాదనిరి. కొలంబస్ ఒక గుడ్డుకు చిన్న చొట్టపడేటట్లు కొట్టి నిలిపి చూపెను.

నాటినుండి నేటివరకు కొత్తపుంతలు తొక్కే వాళ్ళకు మడమలు తొక్కే వాళ్ళ, ముందుకు నెట్టి మడమలు తిప్పే వాళ్ళ బెడద వుంటూ నేవుంది. అడుగుజాడలలో నడిచేవారికి, అనుసరించి బ్రతికేవారికి మార్గదర్శకులు పడిన కష్టనష్టములు, చూపిన ధైర్యసాహసములు, విజ్ఞాన, జ్ఞానముల వైశాల్యము అర్ధము కానందున అనర్ధములు. వడ్డించిన విస్తరిముందు కూర్చోటానికి పెనుగులాటలో తమ చొరవ సామర్ధ్యమునకు మురిసికునేవారు విస్తరలో ఎవరు ఎంత కష్టించి పెట్టారో ఆలోచించలేరు.

ఉన్నతమైన విద్యలు పొందిన సహచరులు ఉపాధ్యాయులుగా, ఉద్యోగులు రూపొందేసమయములో స్వచ్ఛంద వృత్తిలో ప్రవేశించి క్రొత్త పుంత తొక్కారు డాక్టరు సదాశివరావుగారు. అల్లోపతీ వైద్య విస్తరణలో ఉత్తమ స్థానము పొందారు. విద్య పూర్తిచేసికొని వృత్తిలో ప్రవేశించేవారికి శిక్షణ ఇచ్చి వైద్యాలయములు ప్రారంభించటంలో ప్రథమస్థానము పొందారు.

దక్షిణ కోరని గురువు. రోగులు మధ్య వర్తుల ద్వారా, రావలసిన అవసరాన్ని దళారీలద్వారా పిలుపించుకొనే ఆనవాయితీని అరికట్టారు. రోగపీడితునకు దళారీలు, వైద్యుడు చీడ కాకూడదనే పట్టుదల.

క్రొత్త హైస్కూలు, కాలేజీ, ఇంజనీరింగు కాలేజీ అవసరమును గుర్తించిన ప్రథముడు, స్థాపనకు బాధ్యుడు, నిర్వహణలో దక్షుడు.

జయాపజయములతో నిమిత్తము లేకుండా ఆదర్శము కోసము రాజకీయ యుద్ధరంగములో నిలిచినవాడు.

పదవీలోలుడైన అంతేవాసి వర్గోన్మాదులకు కొరముట్టు కాగా మౌనముగా పోరువీడిన నాగరికుడు. మూర్ఖునకు మొగమోటము లేదుగదా! డాక్టరు సదాశివరావు వర్తమాన సమాజమునకు మకుటము. వర్ధమాన సమాజమునకు ఆదర్శము. స్నేహితులలోని మంచికి గుర్తింపు – చెడుకు మరపు. ఆలోచన కలవారికి తోడులేని వారికి నీడ. ★

## నాకు తెలిసిన సదాశివరావుగారు

- రాయపాటి వీరయ్య

అది 1951 వ సంవత్సరం కాబోలు. నేను గుంటూరు నివాసిగా స్థిరపడ్డాను. దాదాపు ఆ సంవత్సరంలోనే డాక్టరుగారితో పరిచయం ఏర్పడింది. ఆ పరిచయం పెరిగి పెరిగి అరమరికలు లేని అనుబంధంగా, ఆత్మీయతగా మారింది. అప్పటి నుండి ఇప్పటి వరకూ వారు మా కుటుంబ వైద్యులుగానే ఉన్నారు.

మానవతా దృష్టితో రోగులకు సేవచేసే వైద్యుడు దైవంతో సమానుడని అంటారు. డాక్టరుగారు ఆయన జీవితాన్ని ఈ పద్ధతిలోనే సరిదిద్దుకొన్నారు. అసలాయన వివాహజీవితమే కట్నం దీసుకోకుండా ఆదర్శంతో ఆరంభం అయింది. స్థాపించిన ప్రజా వైద్యశాల ఆయన అభిరుచులకు తగినట్లుగానే తీర్చిదిద్ద బడింది. విద్యార్థి జీవితంలో తాను అనుభవించిన కష్టాలు ఎప్పుడూ గుర్తు తెచ్చు కొంటూనే ఉంటారు. పేదలకు వైద్యం చేసేటప్పుడు చూపించే కనికరమూ, విద్యార్థుల పట్ల చూపించే ఆదరమూ చిన్ననాటి జీవితాన్ని ఆయన మరచి పోలేదనటానికి సాక్షాలుగా నిలుస్తాయి. డాక్టర్లందరూ కన్సల్టేషన్ ఫీజులు ఇబ్బడి ముబ్బడిగా పెంచుకుపోతుంటే, ఆనాటి నుండి ఈనాటి వరకూ పదిరూపాయల ఫీజే తీసుకుంటూ తన ఆదర్శాన్ని కాపాడుకుంటూనే ఉన్నారు.

ఇటీవల ఆయన చేసిన అమెరికా పర్యటనలో గూడా సర్జరీలో వచ్చిన కొత్త పద్ధతులను, మార్పులను తెలిసి కోవటానికి, ప్రసిద్ధులైన డాక్టర్లను కలిసికొని, వారు ఆపరేషన్ చేస్తున్నపుడు ప్రత్యక్షంగా చూసి, సరికొత్తవిషయాలను గమనించి వచ్చారని తెలిసింది. జీవితాంతమూ ఈ రకమైన శ్రద్ధ, ఉత్సుకత ఉండటం ఆయన వృత్తికే ఎంతో గౌరవం తెచ్చిపెడుతుంది కదా! డాక్టరుకు ఇంతకంటే గొప్పతనం ఏం కావాలి! ఆయన వృత్తిలో సంపాదించుకొన్న గౌరవమే వారి కుటుంబసభ్యుల నందరినీ డాక్టర్లుగా తయారు చేసిందనటంలో అతిశయోక్తి లేదు.

1968 లో జె.కె.సి కాలేజి స్థాపించినపుడు ఆయన ఆ కమిటీలో కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు, మంచిపేరు తెచ్చుకున్నారు. ఉద్యోగ నియామకాలలో గూడా అర్హతకు, క్రమశిక్షణకు, ప్రధమస్థానం కల్పిస్తూ కాలేజీని ఐదేండ్లలోనే అగ్రశ్రేణి కాలేజీగా తయారు చేశారు.

డాక్టరుగారికి సాహిత్యం అంటే అభిమానం ఎక్కువ ఆ కారణంగా ***'సాహితీ సదస్సు'*** స్థాపించి ఎందరో కవులనూ, పండితులను గౌరవించారు. ఉపన్యాసాలు మంచి మంచి విద్యావేత్తల చేత కూడా ఇప్పించి, ఆయన ఏ రంగంలో కాలుపెట్టినా ఎక్కువ శ్రద్ధాభక్తులు చూపిస్తూ ఉంటారు. అదే ఆయనకు పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది.

డాక్టరుగారు ఎంత పేరు సంపాదించుకున్నా ఆయన హృదయంలో గర్వానికి తావు లేదు. ఆ కారణంగా ఆయనతో పరిచయ మేర్పడ్డ తర్వాత ఎవ్వరూ దూరంగా ఉండలేకపోయేవారు. ఇప్పుడాయన రాజకీయాలలో గూడా అభిరుచి కల్పించుకొని ప్రవేశించటం జరిగింది.

ఒకరు ఒక పదవిలో ఉన్నారంటే ఆ పదవిని బట్టి వచ్చే గౌరవం గొప్పదిగా ఉంటుంది. డాక్టరుగారి సమర్థత ఆయనకు మంచి గౌరవం తెచ్చి పెడుతుందనటంలో సందేహం లేదు. ఆయనకు భగవంతుడు ఆయురారోగ్యాలు ప్రసాదించాలని కోరుతూ సెలవు!! ★

## విజ్ఞానికి జేజేలు

- గొరిజవోలు పాండురంగారావు

1947– 57 దశకం నాటికి మన ఆంధ్ర ప్రాంతంలో వైద్యసదుపాయాలు చాలా తక్కువస్థాయిలో ఉన్నట్లే గుర్తు. డాక్టరు సదాశివరావుగారు మధ్యతరగతి కుటుంబములో పుట్టి తన పాఠశాల, కళాశాల విద్యార్థిదశలో ఉత్తమశ్రేణి విద్యార్థిగా పేర్కొనబడి విశ్వవిద్యాలయస్థాయిలో శస్త్రవిద్యలో బంగారుపతక గ్రహీతగా వైద్యరంగంలో ప్రవేశించారు.

వైద్యాలయాన్ని 'ప్రజావైద్యశాల' ప్రారంభించి వైద్యరంగంలో కొత్త వరవడిని తీర్చి, దిద్ది పరిణతి చెందిన వైద్యసేవాపరాయణునిగా సంతోష సంకేతంగా, 1976 వ సంవత్సరంలో రజతోత్సవ విజయకేతము నెగురవేశారు. వైద్యశాల ప్రారంభం నాటినుండి, ఈనాటి వరకు రాత్రింబవలనక, నియమబద్ధతతో నిష్ఠాగరిష్ఠుడై రుజలతో కుందు ప్రజలకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తూ అవిశ్రాంత ధీర గంభీరుడుగా, ప్రజాసేవాపరాయణునిగా పరిఢవిల్లుతూ "***వైద్యో నారాయణోహరిః***" అనే ఆర్యోక్తికి వన్నె తెచ్చారు. బీదబిక్కి, దీన దళితులకు ఉచితవైద్యం చేయడమే కాక, చదువుకోడానికీ ఆర్థికసహాయం కూడా చేస్తూ, వివిధ కోణాలలో తన సేవానిరతిని ఇబ్బడి ముబ్బడిగా పెంపొందించుకుంటూ ముందడుగు వేస్తున్నారు. వారికి విద్యార్థుల మీద మక్కువ. విద్యాస్థాయి, ప్రమాణాలు పెంచాలని ఆకాంక్ష. విద్యా సేవాభిలాషతోనే శ్రీజాగర్లమూడి కుప్పస్వామిచౌదరి కళాశాల వ్యవస్థాపక కార్యదర్శిగా నుండి, తన చొరవ, చాకచక్యము, కార్యదక్షతలతో కళాశాలను ప్రథమశ్రేణి కళాశాలగా తీర్చిదిద్దారు. సెనెటు మెంబరుగా ఎన్నికయ్యారు. తదుపరి వారి సేవలకు ప్రతీకగా విశ్వవిద్యాలయ సిండికేటుకు నియమించబడినారు.

ప్రజాసేవానిరతిని విస్తృతం చేయాలనే ఉద్దేశ్యంతో కావచ్చు డాక్టరుగారు రాజకీయాలలో ప్రవేశించారు. అచ్చట కూడా కుటిల రాజకీయాలకు, కుతంత్రాలకు చోటివ్వలేదు. గ్రామీణవ్యవస్థను వైద్య, విద్యాసౌకర్యాలతో వికసింపచేయాలని, ఆర్థిక వ్యవస్థను పరిపుష్టం చేయాలనే సిద్ధాంతాన్ని విశ్వసించారు. బీదసాదలకు వైద్యం అందుబాటులో ఉండేలాగున కృషిచేయాలనే ఉద్దేశ్యంతో ఉన్నారు. అందుకు అనుగుణంగా వారికి ఆంధ్రప్రభుత్వ అధినేత శ్రీ యన్. టి. రామారావు గారి నుండి శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి గారి భూరివిరాళంతో స్థాపించబడే "పుట్టకురుపు కేంద్రం" (క్యాన్సరు ఇన్స్టిట్యూట్) నిర్మాణానికి సారధ్యం వహించాలనే, ఆహ్వానం వచ్చింది. తన ధ్యేయానికి తగినట్టుగా ఉండడంతో ఔదలదాల్చారు. ఇంతలో అమెరికాలోని తెలుగువారు "తెలుగు మహా సభలకు" ఆహ్వానించారు. 'క్యాన్సరు ఇన్స్టిట్యూట్' నిర్మాణానికి పూనుకొన్న డాక్టరుగారు ఆ కేంద్రానికి కావలసిన ఆధునాతన వైద్యపరికరాలను, సామగ్రిని ప్రోదిచేయడానికి, తెలుగు మహాసభలు అనంతరం, అమెరికా రాష్ట్రాలలో విస్తృతంగా పర్యటించారు. నవీన వైద్యపద్ధతులను, విద్యాపద్ధతులను నిశితంగా పరిశీలించారు. వారి కృషి అనతికాలంలోనే కార్య రూపం ధరించవచ్చు. మంగళగిరివద్ద స్థాపించబడే క్యాన్సరు కేంద్రం వెలుగొందవచ్చు.

డాక్టరుగా వివిధ విరుద్ధ ప్రకృతులు విలక్షణంగా విలసిల్లుతున్నాయి. ఇది ఆశ్చర్యకరమైన విషయం. ఆయన శాస్త్రవిద్యలో ఎంత నిపుణులో, అదే స్థాయిలో వ్యవసాయం, సాహితీ వ్యవసాయం మీద అంత ప్రియత్వముంది. ఆ ప్రియత్వం ఉండబట్టే, గుంటూరులో సాహితీవ్యాసంగం చిక్కి, సన్నగిలే రోజుల్లో సాహిత్యాభిలాషులకు ఒక వేదిక కావాలనే ఆకాంక్షతో 'సాహితీ సదస్సు'కు రూపు దిద్దినారు. ఆ సాహితీసదస్సుకు కార్యదర్శి కృష్ణారావుగారు.

సదస్సు ఆహ్వానం మీద ఎందరో విద్వత్కవులు, కళాప్రపూర్ణులు, తెలుగులెంకలు, కవివరేణ్యులు, కళాతపస్వులు, తాత్వికులు, తత్త్వవేత్తలు, వైయ్యాకరణులు, వేదాంతులు, గీర్వాణులు, మహామహోపాధ్యాయులు, సంఘ

సంస్కరణాభిలాషులు, అభ్యుదయ రచయితలు, విప్లవ రచయితలు అనేకమంది పాల్గొని సాహితీ వ్యవసాయంచేసి, ముత్తెపు విత్తులను నాటడం, కొంగొత్త మొలకలు మొలచి, లతలతో, పూలతో, తరులతో నిండి, ఆ నందనం వెల్లివిరిసింది. ఆ సాహితీ సువాసనలు రాష్ట్రమంతా సుగంధాన్ని వెదజల్లినాయి. సంజీవదేవ్ గారన్నట్లు 'డాక్టరుగారికి సాహితీ. ప్రియత్వంతో బాటు, స్నేహితులను ప్రత్యేకంగా ఆదరించే బాణి ఉంది. వారు గొప్ప డాక్టరై ప్రజలకు సేవచేస్తారు'. అని వారు 1951 లోనే చెప్పినట్లుంది. వారి సాహితీ ప్రియత్వానికి నిదర్శనం కాబోలు, కవిపుంగవులు బోడేపూడి వెంకట్రావు గారు తన "కృష్ణావర్తము" కావ్యాన్ని, కొల్లా కృష్ణారావుగారు తన 'పూదోట' ఖండకృతిని ప్రేమానురాగాలతో, ఆనందానుభూతులతో నిర్మలహృదయుడైన డాక్టరు గారికి అంకితమిచ్చారు. ఆ సాహితీ వేదికలో ఉన్నతవ్యక్తుల సాహితీవేత్తల సందడి చూచి కాబోలు ఆత్మీయులు జే.రామారావుగారు సాహితీసదస్సును సాహిత్యము, కళలపై మేధావులు పాల్గొనే సమావేశం "Conversazione"(a scholarly social gathering held for discussion of literature and the arts.) అన్నారు. ఆ మాట అతిశయోక్తి కాదు.

డాక్టరుగారు విన్నాణి. విభిన్న ప్రకృతులకు, అభిరుచులకు ఆలవాలమనే నా ఆలోచన సన్నిహితునిగా పెదకూరపాడు ఎన్నికలలో పర్యటించినపుడు రూఢి యయింది. నియోజకవర్గ కాలినడక పర్యటనలో, పల్లెవాసులతో, బడుగువర్గాలతో, వారి బాగోగులను, పాడిపంటలను, ఆహారవిహారాలను, వాసనము, గోసనముల గురించి చర్చించినప్పుడు వారిలో ఏటుకూరి వారి క్షేత్రలక్ష్మినో, జాషువాగారి ఖండకావ్యాలనో, నార్లవారి మాటలో ఏవో సమయస్ఫూర్తిగా వారితో, మాతో ప్రస్తావించి మాట్లాడుతుండేవారు. విషయాలన్నీ వారి సాహితీప్రియత్వానికి, ఆలోచనకు, ఆనవాళ్ళనుకొండి.

డేల్ కార్నిగె నుడివినట్లు డాక్టరుగారికి స్నేహితులను ఎలా సాధించుకోవాలో, వ్యక్తులను ఎలా ఆదరణపూర్వకంగా కౌశలంతో వారి మనస్సులు జయించి ఆకట్టుకోవాలో, స్వాధీనపరచుకోవాలో అంటే తనవారిని చేసుకోవాలో, వివిధ ప్రవృత్తుల వారితో ఎలా మసలుకోవాలో వారికి వెన్నతో బెట్టిన విద్య. ఒకసారి తనకు సన్నిహితులుగా మెలిగినవారిపై వారి ప్రభావం శాశ్వతత్వం ఏర్పరచుకుంటుంది.

వారికి సంపాదన మీద అంత మక్కువ, పట్టు లేవు. స్నేహ సంపాదనమీద వారి ప్రేమ, దృష్టి ఉంది. వారన్నట్లు "సంపాదన అన్నింటిలో స్నేహ సంపాదన చాలా గొప్పది, తరగని ఆస్తి". పెంచుకొన్న కొద్దీ పెరిగే అమూల్యమైన ఆస్తి. అసూయ, విద్వేషాలను విరిచివేయగల ఆస్తి. ఈ రహస్యం డాక్టరు గారికి ఎప్పటినుండో తెలుసు. వారు వృత్తిలో, వ్యక్తిగత పరిచయాలలో, స్నేహాలలో, తు.చ. తప్పక అమలు పరచినారు. స్నేహితుల సంపాదనే ముఖ్యంగా ఎంచుకొని, ఆస్థి సంపాదనను వెనక్కు నెట్టడం జరిగింది.

ఇన్ని విశిష్టలక్షణ సమన్వితుడైన డాక్టరుగారికి అర్ధాంగిగా ఉన్న డాక్టరు జయప్రదాంబగారు కూడా సాహిత్యాభిలాషి, కథారచన కలవడిన వారే. అందుకే డాక్టరు గారికి విజయం అలవోకగా లభించిందేమో కూడా! వేర్వేరు రంగాలలో వివిధ కోణాల్లో, ఉత్కృష్ట లక్షణాలతో విరాజిల్లే డాక్టరుగారు మరి కొలది కాలాలపాటు వైద్యసేవలో, ప్రజాసేవలో, స్నేహితులతో, సాహిత్య ప్రియంభావుకతతో విరాజిల్లాలని, వారి అనుభవం రాష్ట్రానికి ఉపయోగపడాలని, వారికి కావలసిన అనంతశక్తి, ఆరోగ్యం, కీర్తి లభింపచేసి తోడ్పడాలని కోరుతూ, వారి షష్టి పూర్తి సందర్భంగా నా జేజేల నందిస్తున్నాను. ★

## సాహితీపోషకులు

-శ్రీ అప్పయ్య - బి. కామ్, బి.ఎల్.

సుప్రసిద్ధశస్త్రవైద్యులు, సహృదయులు, సాహితీపోషకులు, పెదకూరపాడు నియోజకవర్గ శాసనసభ్యులు డాక్టరు కాసరనేని సదాశివరావు గారి షష్టి పూర్త్యుత్సవమన్న వార్తవిని ఆనందించితిని. శ్రీసదాశివరావుగారు వైద్యులు. అందులో శస్త్రచికిత్సా నిపుణులు. "వైద్యో నారాయణో హరిః" అను ఆర్యోక్తి వీరిపట్ల సార్ధకమైనది.

ధనార్జనకన్నా మానవసేవయే ప్రధానముగా నెంచి "ప్రజావైద్యశాల"ను ప్రారంభించినప్పటి నుండి వారుచేసిన ప్రజాసేవ నిరుపమానము. వీరి సహధర్మచారిణి డాక్టరు శ్రీమతి జయప్రదాంబ గారు గూడ సహకరించుట ప్రశంసనీయము.

డాక్టరు సదాశివరావుగారు శిష్యవాత్సల్యము మూర్తీభవించిన సౌజన్యమూర్తి. వీరి శిక్షణలో ఎందరో వైద్యవిద్యార్థులు ఉన్నతస్థితికి వచ్చి దేశ, విదేశాలలో నున్నారు. వారికి పరిచయస్తులైనను, కాక పోయినను, విద్యార్థులకు, సాహితీపరులకు, పేదలకు ఉచితముగా వైద్యము చేసి అందరి ఆదరాభిమానములు చూరగొనిరి. వీరి నిరాడంబర, నిస్వార్థజీవితము ఆదర్శప్రాయమైనది.

డాక్టరు గారు దాదాపు ఇరువది సంవత్సరముల నాడు సాహితీ సదస్సును నెలకొల్పి ప్రతి నెలా ఒక సమావేశమును జరిపి ప్రముఖ సాహితీవేత్తల ప్రసంగములను, కవితాగానములను ఏర్పాటు చేశారు. అనేక కావ్యములను తీసికొని పెక్కుమంది కవులకు చేదోడు వాదోడుగా ఉన్నారు.

డాక్టరు కాసరనేని వారు ఎంతటి గొప్పవైద్యులో అంతటి విద్యాభిమాని. జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల కార్యదర్శిగా నుండి దానిని అగ్రశ్రేణి కళాశాలగా రూపొందించుటలో ఎనలేని కృషి చేసిరి. మరికొన్ని విద్యాలయాల స్థాపనకు గూడ దోహద మొనర్చిరి. ఇటీవల వీరు విదేశపర్యటన సందర్భమున అమెరికా, ఇంగ్లాండు దేశాలలోని వైద్య పరిశోధనాలయాలతోపాటు, విశ్వవిద్యాలయాలను సందర్శించుట విశేషం.

విద్యా, వైద్య, సాహిత్య, సాంస్కృతిక రంగాలతో పాటు రాజకీయరంగంలో గూడ ప్రవేశించారు. అందులోనూ నైతికవిలువలకు ప్రాధాన్యం ఇచ్చి ప్రఖ్యాతి నందిరి. డాక్టరుగారి శక్తిసామర్థ్యములను, నీతి నిజాయితీలను గుర్తించిన ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ రామారావుగారు "డాక్టరు సదాశివరావుగారి సేవలు ఒక్క పెదకూరపాడు నియోజకవర్గానికే కాక, యావత్తురాష్ట్రానికి అవసరం" అని ప్రశంసించారు. ముఖ్యమంత్రి గారన్నట్లు వీరి సేవలు ఆంధ్రప్రదేశ్ వినియోగించుకొనే అవకాశం త్వరలోనే వస్తుందని ఆశిస్తూ ఈ షష్టిపూర్తి సందర్భమున కాసరనేని దంపతులకు నా అభివందనాలు.

## విశిష్ట వ్యక్తి - డాక్టరు ముద్దన హనుమంతరావు

అది 1958 – 59 సంవత్సరం. నేను కాలేజీలో చదవటానికి గుంటూరు చేరాను. సదాశివరావుగారికి దగ్గరలో సాంబశివపేట 3వ లైనులో ఉంటున్న రోజుల్లో మేము ఉదయం కాఫీకి వచ్చే సమయం, డాక్టరుగారు హాస్పటల్ కు వెళ్ళే టైమ్ ఒకటే. మా హోటల్ డాక్టరుగారి హాస్పటలుకు ఎదురుగా ఉండేది. ఎదురుపడ్డ రోజున ఎవరినో ఒకరిని పిలిచి షర్టు బటన్సు పెట్టి ఛాతి కనిపించకుండా బటన్సు పెట్టుకోవాలి అంటూ ఉండేవారు.

నాకు డాక్టరు గారితో మొదటి పరిచయం జరిగింది. అప్పటి నుండి వారంటే అదోరకం భయం! భక్తి! ! ఎందుకో? ఎం. బి. బి. ఎస్. లో చేరిన తరువాత డాక్టరుగారి తమ్ముడు సీతాపతిరావు నేను ఒకేగదిలో ఉండి చదువుకోవటం, వారి కుటుంబాన్ని గురించి తెలుసుకోవటం, వారి ప్రేమాదరములకు పాత్రుడను కావటం జరిగింది. డాక్టరు సదాశివరావుగారికి దగ్గరయ్యాను.

1968 లో ప్రాక్టీసు పెట్టి వారి అండదండలతో, ప్రోత్సాహంతో, ధైర్యముగా, వైద్యుడిగా నిలబడగలిగాను. మరీ దగ్గరై నేను ఎన్నో నేర్చుకొన్నాను. జీవితం అంటే చనిపోయేదాక బ్రతకటం కాదని తెలుసుకొన్నాను. చనిపోయేవరకు మన బాధ్యతలు మనం నెరవేర్చాలని అర్థం జేసికొన్నాను.

డాక్టరుగారు వృత్తిరీత్యా రోగులయెడ తన బాధ్యతలు ఎలా నిర్వర్తించిందీ గుంటూరులో ఎక్కువమందికి తెలుసు. తోటి డాక్టర్లకు ఎంతో చేయూతనిచ్చి ఎంతో మందిని తనంతటి వారిని చేశారు.

గుంటూరు, పరిసర ప్రాంత వాస్తవ్యుల విద్యావసరములను గుర్తించి గుంటూరులో విద్యాసంస్థల స్థాపనలో తన బాధ్యతలను నిర్వర్తించారు. క్యాన్సరు జబ్బుకు వైద్య సహాయము అందుబాటు చేయవలెనని క్యాన్సరు హాస్పటలు స్థాపనకు తన బాధ్యత నెరవేర్చుచున్నారు.

అన్నగా, తండ్రిగా, గుంటూరు పౌరునిగా, దేశపౌరునిగా గూడ తన రాజకీయ బాధ్యతలను నెరవేర్చిన వ్యక్తిగా, జీవితధ్యేయం పూర్తిగా నెరవేర్చుటకు, పరిపూర్ణ వ్యక్తిత్వము సంపాదించుటకు ప్రయత్నం చేసిన వ్యక్తి. అట్టి మహనీయుని గన్న శ్రీమతి భాగ్యమ్మ, కీ॥ శే॥ శ్రీరామశాస్త్రులు ధన్యజీవులు. అట్టి పురుషునకు నా నమస్సుమాంజలులు. ★

## ఆదర్శ వైద్య దంపతులు

- డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి

మూడున్నర దశాబ్దాలుగా వైద్య, విద్యా, రాజకీయ, సాహితీ, సాంస్కృతిక రంగాలలో నిరుపమాన సేవలను అందిస్తున్న డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు మన గుంటూరు జిల్లాకేగాక, ఆంధ్రదేశమునకు వన్నె తెచ్చిన ప్రముఖులు.

ప్రముఖ శస్త్రవైద్యులుగా జిల్లా ప్రజల గౌరవాభిమానాలను విశేషంగా చూరగొన్న డాక్టర్ సదాశివరావు గారు, వారి సతీమణి డాక్టర్ జయప్రదాంబగారు 'ప్రజా వైద్యశాల'ను గుంటూరులో స్థాపించి, వైద్య సౌకర్యాలను సామాన్యులకు అందుబాటులో ఉండే విధంగా తీర్చిదిద్దారు. వీరు ఆదర్శవైద్యదంపతులుగా అన్ని తరగతుల ప్రజల మన్ననలను పొందారు. డాక్టరు సదాశివరావుగారు 10 సంవత్సరములకు పైగా, గుంటూరు గవర్నమెంట్ జనరల్ హాస్పిటల్లో ఆనరరీ సర్జన్ గాను, గుంటూరు వైద్యకళాశాలలో సర్జరీలో ఆనరరీ ప్రొఫెసర్ గా పనిచేసి వందలాది వైద్యవిద్యార్థులకు, ఎం. ఎస్. విద్యార్థులను సుశిక్షితులను చేసి ఆదర్శ అధ్యాపకునిగా కూడ లబ్ధ ప్రతిష్ఠులైనారు.

విద్యారంగములో డాక్టరు సదాశివరావుగారు జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి కళాశాల స్థాపనలో, అభివృద్ధిలో అవిరళ కృషి చేశారు. ఆంధ్ర, నాగార్జున విశ్వవిద్యాలయములలో సెనెట్, సిండికేట్ సభ్యులుగా ప్రశంసనీయమైన కృషి చేశారు. వృత్తిరీత్యా తీరిక లేకున్నను, 'సాహితీ సదస్సు' ను 1966 ప్రాంతాలలో గుంటూరులో స్థాపించి, అనేకమంది కవులను, పండితులను, రచయితలను, మేధావులను ఆహ్వానించి, వారి ప్రసంగములను, కవితాగోష్ఠులను ఏర్పాటు చేసేవారు.

ప్రముఖులు సాహితీసదస్సులో పాల్గొని సాహితీప్రియులకు మధురానుభూతులను అందించేవారు. నాబోటివారికి సాహిత్యాభి లాషను కలిగించింది సదాశివరావుగారే, "జీవశాస్త్ర విజ్ఞానం"(1968) అనే నా అనువాద పుస్తకాన్ని చదివి నన్ను ప్రోత్సహించారు. 1975 లో వైద్యవిజ్ఞాన వ్యాసాలను "డాక్టరు గారి డైరీ" అనే పేరుతో నేను వ్రాసిన పుస్తకానికి వారు "పరిచయం" వ్రాసి ప్రోత్సహించారు.

రాజకీయరంగములోకూడ వారి అభిప్రాయములతో నాకు ఎక్కువ ఏకీభావము ఉండేది. మొదటినుండి కాంగ్రెసు వ్యతిరేక పక్షములపట్ల వారికి అభిమానము ఉండేది. పార్లమెంటుకు, అసెంబ్లీకి జనతాఅభ్యర్థిగా పోటీచేసినప్పుడు, వారి నియోజక వర్గమునకు చెందిన తెనాలి సమీపగ్రామాలకు వారి అభిమానులమైన మేము కొంతమందిమి వెళ్ళి ప్రచారం చేశాము. రెండుసార్లు దురదృష్టవశాత్తు విజయలక్ష్మి వారిని వరించకున్నను, తుదకు 1985 అసెంబ్లీ ఎన్నికలలో మన ఆరాధ్యనాయకుడు శ్రీ ఎన్. టి. ఆర్ గారు డాక్టర్ సదాశివరావుగారి విశిష్టతను, వ్యక్తిత్వాన్ని గుర్తించి పెదకూరపాడు నియోజకవర్గానికి అభ్యర్థిగా ఎన్నిక చేయడం, వారు అధిక మెజారిటీతో గెలుపొందడం డాక్టరుగారి అభిమానులందరికీ హర్షామోదాలు కలిగించాయి.

సాంఘిక సేవారంగములోకూడా, మంగళగిరి వద్ద 'యార్లగడ్డ వెంకన్నచౌదరి ఫౌండేషన్' వారి ఆధ్వర్యంలో స్థాపించనున్న 'క్యాన్సర్ చికిత్సా పరిశోధనా కేంద్రము' నకు కార్యదర్శిగా పట్టుదలతో కృషి చేయుచున్నారు. గుంటూరుజిల్లా ప్రజలకు, తెలుగు ప్రజలకు బహువిధాలుగా సేవలొనరించుచున్న డాక్టరు సదాశివరావుగారి షష్టిపూర్తి మహోత్సవసందర్భముగా, ఈ ఆదర్శ వైద్యదంపతులకు నా మనఃపూర్వక శుభాభివందనములు. వీరి కుమారులు, కుమార్తెలు, కోడళ్లు, అల్లుళ్లు అందరూ వైద్యులే కావడం విశేషం. ఈ ఆదర్శవైద్యకుటుంబం చిరకాలం తెలుగువారి కీర్తిప్రతిష్ఠలను ఇనుమడింపచేయగలదని నా విశ్వాసం. షష్టిపూర్తి సభలో వైద్య ప్రముఖులు డాక్టర్ డి. జగన్నాధరెడ్డి గారు, "లోకాయుక్త" ఆవుల సాంబశివరావుగారు, ప్రసిద్ధతత్త్వవేత్త డాక్టర్ కొత్త సచ్చిదానందమూర్తిగారు, "తెలుగులెంక" తుమ్మల సీతారామమూర్తిగారు మున్నగు ప్రముఖులు పాల్గొనుచున్నారని తెలిసి మహదానందముగా ఉన్నది. డాక్టరు దంపతులు మరెన్నో సంవత్సరములు ఆయురారోగ్యములతో తెలుగు ప్రజలకు సేవలను కొనసాగించవలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను. ★

## అక్షరాకాంక్షలు

- పి. అచ్యుతరామ్

వారికీ నాకూ పరిచయ సంచయాలు అనేకం. ఇంచుమించు రెండు దశాబ్దాల కాలపరిమితిలో మా పరిచయ పరిభ్రమణం సాగిపోతూనే వుంది. ఈ పరిభ్రమణంలో అనుభూతులు, అనుభవాలు, అనుభావాలు అన్యంగా ఉన్నాయి. వాటన్నిటినీ కలబోయగా, మిగిలిందొక అనిర్వచనీయ అనుబంధం. ఇదే నా యీ నాలుగు మాటల ఆలంబన.

డాక్టర్ సదాశివరావుగారు వైద్యంలో అనవైద్యులు; దేశికుల్లో దేశికులు; సాహిత్యంలో ఉత్తమ సాహితీ సంపన్నులు; ప్రగతిశీల ప్రజాస్వామ్య ప్రధనశీలురు; సాంఘిక న్యాయసాధనా తత్పరులు; అన్ని వైపులా మానవతకు మార్గం దిద్దే మనీషి.

ప్రజావైద్యశాలలో రుజాగ్రస్తులకు నయం చేసినా, ఎందరెందరో భిషక్కులకు ఉత్తేజం కలిగించినా, సాహితీ సమీరం అందించినా, జానపదులకు జాగృతి కలిగించినా, సామాన్య మానవ సంక్షేమానికి కాసె బిగించినా, సాంస్కృతిక జీవన స్రవంతులకు నడవడులు దిద్దినా, రైతు జీవనసమస్యా స్ఫూర్తిని రేకెత్తించినా, ప్రజాజీవనచింతనలో హితుడుగా, సన్నిహితుడుగా నిలిచినా, ప్రజా ప్రాతినిధ్యంతో ప్రజాసమస్యల పరిష్కారంలో ప్రఖ్యతి పొందినా, తెలుగువెలుగులకు నిరంతరకృషి జరిపిన అన్ని వ్యాసంగాల్లోనూ ఆయన్ను తీర్చిదిద్దేది సమదర్శనం; ఆయన్ను కర్తవ్యోన్ముఖుణ్ని చేసేది సమ హితత్త్వావలోకనం. సిన్సియారిటీతో బాటు సీరియస్ నెస్ ను వారిలో చూడగలం.

అరవిడిచిన అరవిందంలా సాగిన అరవై వసంతాల ఆమని జీవితం ఎంత హృదయంగమంగా వుందో ఏమని చెప్పగలం ? వారి ముందున్న జీవితంకూడా లతామంజులంగా, మంజులతా పరిశోభితంగా సౌజన్యసౌరభాలను గుబాళించాలి. డాక్టర్ సదాశివరావు గారికి, వారి సతీమణి డాక్టర్ జయప్రదాంబ గారికి, డాక్టర్ కుటుంబ డాక్టర్లకూ, చిన్నారి పొన్నారులకు ఇవే మా అక్షరాకాంక్షలు. ★

"కులము పేరిట బలిదీయ కులుకుచున్న
కాలమూర్తికి నా నమస్కార మన్న! " "కవిబ్రహ్మ" — ఏటుకూరి

## రైతుబిడ్డ

- రామినేని శివరామయ్య చౌదరి,
డైరెక్టరు, ఎ. పి. కాటన్ అసోసియేషన్

భూమాతనుండి పంటలను, ఫలములను ప్రపంచమున కందించువాడు రైతు. జగత్తునకు మూలాధారము రైతు. అట్టి రైతు కుటుంబములో కాసరనేని సదాశివరావుగారు జన్మించి, తన విద్యార్థి దశలోనే అనేక మన్ననలు పొంది, వైద్యశాస్త్రములో పట్టభద్రుడై, శస్త్రవిద్యలో బంగారు పతక గ్రహీతయైనాడు.

అనతికాలములోనే గుంటూరు జిల్లాలోనే కాక, యావదాంధ్ర దేశములోనే శస్త్రచికిత్సా నిపుణులుగా, ప్రతిభావంతులుగా పేరు గాంచినారు. సదాశివునిలో ఏదోయొక విశిష్టత యున్నది. వైద్యములో రోగులపాలిట నారాయణుడు,స్నేహశీలి, సాహితీప్రియులైన డాక్టరు సదాశివరావు గారి షష్టిపూర్తి సందర్భమున నా హృదయ పూర్వక అభినందనలు.

## MY MASTER - డాక్టరు జెక్కంపూడి సీతారామరావు

డాక్టరు సదాశివరావుగారి షష్టిపూర్తి అభినందనచంద్రికలో నా మాటలు కూడా వుంటే బాగుంటుందని ఆత్మీయులు శ్రీకృష్ణారావు గారు అభిప్రాయపడటం సమంజసమే. సమస్య ఏమిటంటే "మాస్టారు"గార్ని గురించి వ్రాయటం అంటే "దేనిని గూర్చి" అని. ఒక యాత్రికుడు ప్రసిద్ధమైన చిత్రాన్ని ప్రదర్శనశాలలో చూచాడు. వెంటనే వెనుదిరిగాడు. అచటనే వున్న "క్యూరేటరు" ఆ యాత్రికుడ్ని ఈ "చిత్రం" మీకు నచ్చలేదా!" అని ప్రశ్నించాడు. 'నచ్చింది. కానీ ఇందులో నాకింకా అర్థం కానిది ఏదో మిగిలివుంది.' జవాబు. అప్పుడు ఆ క్యూరేటరు. "మీరు ఒక కోణాన్నుండి మాత్రమే ఈ చిత్రాన్ని దర్శించారు. విభిన్న కోణాల నుండి, విభిన్న రీతులలో ఈ చిత్రాన్ని దర్శించవచ్చు – రండి" అని ఆ చిత్ర ప్రాశస్త్యాన్ని విశదీకరించాడు.

అలానే మాస్టార్ని దర్శించాలంటే ఒక "బయోగ్రఫి" మాత్రమే సరిపోతుంది. అది ఒక "బోస్వెల్" మాత్రమే వ్రాయగలడు. అశేషమయిన శిష్యగణానికి వారు "మాస్టర్". ఇతరులకు డాక్టరుగారు. ఆమె లేడీ డాక్టరు గారు – అమ్మగారు.

మాస్టరుగారితో వున్న శిష్యుల అనుబంధం, ఆరాధనతో, అడ్మిరేషనుతో కూడుకొన్నది. నాలాంటి వాడిది భక్తిభావం. నాలాంటి భక్తులెందరో వారికి. నా వైద్యశాలను డాక్టరు జయప్రదాంబగారు 1969 మార్చి 23 న ప్రారంభించారు. ఈ ఉత్సవము కూడా అదే రోజున జరగటం యాదృచ్ఛికం అని నాకనిపించటం లేదు.

ఎందరో శస్త్రవైద్యులున్నారు, ఉపాధ్యాయులున్నారు. నేను అందరితో చెప్తాను "వీరు అస్త్రవైద్యులు అని. సాహితీస్రష్టలు, సాహితీ పోషకులు, సాహితీప్రియులున్నారు; విద్యావేత్తలు, విద్యాదాతలు, ఎందరో మహానుభావులు." మిత్రుడు డా ॥ పిడికిటి వెంకటేశ్వర రావు అన్నాడు – వీరు ఒక "అవధాని". ఎందరికి తెలుసు! వారు "మూత్ర పిండాన్ని మూడునిముషాల్లో తొలగించిన సంగతి!" ఎందరకు తెలుసు వారు చేసిన గుప్తదానాలు. ఎందరికి అనుభవం ఆయనలోని సౌజన్య బలహీనత. గురజాడ చెప్పినట్లు "వారితో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్". ఒక జీవితకాలంలో నేర్వలేనిది, పరిచయంలోనే వారివద్ద నేర్చినవారెందరో వున్నారు. వారికి "పాతరోత గాదు, క్రొత్తొక వింత గాదు".

వింత ఏమిటంటే వారికి చాలా ఇష్టమైన పద్యం ఒకటుంది: ఆముక్తమాల్యదలో...

*ఉన్నట్లు యుండ నద్దరి*
*కిన్నరులను నావజేర్చు క్రియ వెసదాబో*
*కున్నట్లు యుండి కాలం*
*బున్నరులకు వయసు బుచ్చి మోసము దెచ్చున్!*

కాలమహాత్యం తెలిసినవారు. అందుకే ఈ షష్టిపూర్తికి అంగీకరించారని నా అభిప్రాయం. ఈ షష్టిపూర్తికి పూర్తి మెట్టుపై నుండి, జీవిత సింహావలోకనం బహుశా వారి అభీష్టమై వుంటుంది.

అనుభూతులు – ఆత్మీయతలు– కాళిదాసు చెప్పినట్లు "పూర్వజన్మ పరిచయాలు".

మొదటనే వ్రాశాను. నేను భక్తుడిని. ఒక ముద్దుపళనికి, ఒక పోతనకు సాధ్యమౌతుంది ఆ ఆరాధనను, భక్తిని వాక్యగతం చేయటానికి నేనేపాటి.

భగవంతుడు వారికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించగలడు. శుభం. శాంతిః శాంతిః ★

## అమృతహస్తుడు

- పెనుముచ్చు శంకరరావు, మండెపూడి

దురదృష్టవంతులందరు బీదవారుగా జన్మిస్తారని. సామెత. ఆ బీదలలో అధికభాగము రైతులేనని నా అభిప్రాయము. అట్టి రైతుకుటుంబములో జన్మించి, మహోన్నతస్థాయికి చేరుకొని, అందరు అనుసరింప దగినంతటి ఆదర్శము!

అసూయ పడదగినంత ఎత్తుకు చేరి, అరువది వసంతాలలో ముగ్గురు పరిపూర్ణ మానవజీవితాలలో సాధించునంతటి అనితర సాధ్యాలను ఏకకాలములో కలబోసి, గరిష్ఠ ప్రామాణ్యతను, విద్యా, వైద్య, సాంఘిక సేవాపరముగా సాధించిన ఒక ప్రముఖ మహనీయుని గురించి పేదరైతు బిడ్డగా నాలుగుమాటలు చెప్పుకొనవలెననే తపన, చెప్పుటకు ఏ విశిష్టతలేని నేను నాలుగుముక్కలు చెప్పుకొనవలెనని.

నా చిన్నతనం నుండి ఆ అమృతహస్తం తప్ప మరొకచేయి నా శరీరాన్ని తాకలేదు. వారికి కలిమిలేముల భేదము లేదు. అందరూ ఒక్కటే. రాజకీయపరంగా దర్శించుకొన్నా, వైద్యపరంగా దర్శించుకొన్నా ఒకే ఆదరణ, ఒకే ఆప్యాయత. వీలైనంత సహాయము చేయగలరు. నైతిక విలువలకు ప్రాధాన్యమిచ్చెదరు. ధనార్జన వారి ధ్యేయము గాదు. రైతుల పట్ల వల్లమాలిన అభిమానము శాసనసభ్యులైన తదుపరి వారి దృష్టికి తెచ్చిన ప్రతి చిన్నవిషయమును ప్రత్యేక శ్రద్ధతో పూర్తిచేసెదరు.

డాక్టరు సదాశివరావుగారు నిరాడంబరులు. వారింటికి వెళ్ళినప్పుడు మనకు కనుపించేది ఆప్యాయతే కాని అట్టహాసము గాదు. ఆదరణయే కాని అహంకారము గాదు. ప్రాచీనాంధ్ర సాహిత్యము నుండి ఈనాటి కవుల పుస్తకములన్నియు కొలువుదీరి యుంటాయి. విద్యా, వైద్య, సాహిత్య, సాంస్కృతిక, రాజకీయాది రంగాలలో వారు చేసిన సేవకు తగిన ప్రతిఫలము లభింపలేదు.

కాని వారి శిష్యులు షష్టిపూర్తి మహోత్సవమును వైభవముగా జేసి కొంతలో కొంతైన ఆ లోటును తీర్చినారని అనుకొంటున్నాను. ప్రతి పురుషుని విజయానికి స్త్రీయే కారణమనే సామెతను నిజం జేసిన శ్రీమతి జయప్రదాంబ అమ్మగారికి, ఆ మహనీయునకు నమస్క రించటం తప్ప మరేమి ఇచ్చుకొనలేని సామాన్యుని నమస్సుమాంజలులు.



*"సదాశివుని షష్టిపూర్తి ~ జనావళికి ఇష్టపూర్తి*
*సదాశయుని సమ్మానం ~ సమస్త ప్రజకు సమ్మోదం"*



## వైద్య నిపుణులు - గుంటుపల్లి నాగేశ్వరరావు

బహుముఖ ప్రజ్ఞాశాలి, విద్యావేత్త, వదాన్యులు, వైద్యనిపుణులు, కళాపోషకులు, సాహిత్యారాధకులు, ప్రజాస్వామ్యవాది అయిన కాసరనేని సదాశివరావు గారు జగమెరిగిన బ్రాహ్మణులు. నేను వారి వైద్యశాలలో జన్మించితిని. నాకు ఊహ తెలిసినప్పటి నుండి నన్నెన్నియో విధముల ప్రోత్సహించుచు, ఆదరించుచు, అభిమానించుచు నున్న డాక్టరుగారి నెన్నటికి మరువజాలను.

డాక్టరు సదాశివరావుగారు విద్యార్థులకు హితులు, సన్నిహితులు. వైద్యవృత్తి నారంభించినప్పటి నుండి కుల, మత, వర్గములను పాటింపక విద్యార్థులకు ఉచితవైద్యము చేయుచు పలువురు ప్రభావితుల చేసి ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దిన వారు సార్థక నామధేయులు. ఏమాత్రము పరిచయమున్న వారికైనా వారు బోళాశంకరుడని అట్టే తెలిసిపోవును. అభ్యర్థించిన వారికి యధాశక్తి సహకరించుట వెన్నతో పెట్టిన విద్య.

డాక్టరుగారు రైతు పక్షపాతి. రైతులన్న, రైతు కుటుంబములన్న వారికెంతో యిష్టము. రైతుల స్థితిగతులను, ఆర్థిక పరిస్థితులను గురించి తెలిసికొనుచు. వారి అభ్యున్నతికి సూచనలిచ్చుట నిత్యకృత్యము, వైద్యవృత్తిలో నున్నను యువకులకు వ్యవసాయమును గూర్చి వివరించునప్పు డాశ్చర్యపడెదను. రైతులపట్ల వారికున్న అభిమానము వల్లనే మొదట ఆచార్య ఎన్.జి. రంగాగారివైపు, తదుపరి చరణ్ సింగ్ గారి పక్షము జేరుట తటస్థించినది.

శ్రీ సదాశివరావు దయార్ద్రహృదయులు. ఎంతోమందికి ఉచితవైద్యము చేసి "ప్రజా వైద్యశాల" పేరును సార్థకము చేసికొన్నారు. పేదలపట్ల సానుభూతి గలవారు. డాక్టరు గారొక పర్యాయము మాటల సందర్భమున "ఇప్పటికన్నా యింకా చౌకగా వైద్యము చేయలేకపోతున్నాను అనే బాధతప్ప యింకా ఎక్కువ ఖరీదు వైద్యుడను కాలేదని నా కెప్పుడు బాధ లేదు" అని అన్నారు. ఏమా సంకల్పము! ఇంతటి ఉదారస్వభావము గల వైద్యులెవరున్నారు?

డాక్టరుగారి సాహిత్యాభిలాష జగద్విదితము. సాహితీ సదస్సు నెలకొల్పి నిరుపమానమైన సేవయొనర్చిరి. పలువురు కవులను, రచయితలను పరిచయము చేసి, కొన్ని రచనలను గూడ వెలువరించిరి. చాలమంది ఉపాధ్యాయులకన్న వీరి కెక్కువ పద్యములు వచ్చునన్న అతిశయోక్తి కాదు. వారితో సంభాషించుట ఒక గ్రంథమును చదువుటయే. బాల్యమునుండి రాజకీయములపట్ల ఆసక్తి ఉన్నది. గ్రామీణాభివృద్ధి జరుగనిదే ఆర్థిక అసమానతలు తొలగవని వారి నిశ్చితాభిప్రాయము, అభిప్రాయ భేదములున్న వారితోనైన వ్యక్తిగతసంబంధముల నభిలషించు సహృదయులు. సంప్రదాయము, హేతువాదముల మేలుకలయికయే డాక్టరుగారి వ్యక్తిత్వము. డాక్టర్ సదాశివరావుగారు శస్త్రచికిత్సా నిపుణులు మాత్రమే యని కొందరి యభిప్రాయము. కాని రోగనిర్ణయములో నిరుపమానమైన ప్రతిభ గలవారు.

సమాజమునకే మార్గదర్శకులైన డాక్టరు సదాశివరావుగారికి షష్టిపూర్తి మహోత్సవము జేయుట చిరుకానుక మాత్రమే. వారు ఆయురారోగ్యములతో యావదాంధ్రులకు సేవచేయాలని మనఃపూర్వకముగా ఆకాంక్షించుచున్నాను. ★

"నమ్మువాని చెరచు నాపలేనాడైన – చెడకపోరు బాగుపడగ లేరు".

## మహోన్నతవ్యక్తి

- కిలారి రాజన్ బాబు

*శ్లో॥ వాక్సూనృతాదయాదానం,*
*దీనోపగత రక్షణం*
*సత్సంగత్వం వివేకత్వం,*
*త్రిలోకస్య విభూషితం ॥*

సత్యవాక్కు, దయాదాక్షిణ్యత, దాతృత్వత, దీనజన సంరక్షణము, సత్సాంగత్యము ముల్లోకములలో గౌరవింపదగిన సత్పురుషుల నిత్యకృత్యములని నీతికోవిదులు తెల్పిరి. మిమ్ములను వలచి, వరించి నేటివరకు గౌరవప్రపత్తులను చేకూర్చి నేడు అందరకు, ఆప్తులకు ఆనందము చేకూర్చగా షష్ఠిపూర్తి చేసుకుంటున్నాయి. మీ యందు నిబిడీకృతమైన ఈ సద్గుణసముదాయము. మీ సహచరిత్వముచే ప్రజానీకము ముందు శోభాయమానమై విరాజిల్లుచున్నందుకు మా కెంతో ముదావహము. అంతేగాక

*శ్లో॥ అయం నిజః పరోవేతి,*
*గణనాలఘు చేతసాం ॥*
*ఉదార చరితా నాంతు,*
*వసుధైవ కుటుంబకమ్*

'ఇతడు మనవాడు, అతడు పరాయివాడు అనే విచక్షణ స్వల్పమనస్కులకుంటుంది. మరి ఉదారహృదయులకు ఈ లోకమంతయూ తనదేయను భావం కలిగి యుంటుంది.' అని హితోపదేశము చెబుతుంది. అటులనే మీ హృదయమున త్యాగము – దయ– ప్రేమ ఆనువానికి ఉత్తమస్థానమును కల్పించుకొని, మంచితనముచే ప్రజల మనసులందు మనుతూ సర్వదా స్మరణీయులై, పై శ్లోకమునకు తగిన నిరూపణను చేకూర్చినారు. ఇది మీ మహోన్నత దివ్యవ్యక్తిత్వమునకు నిదర్శనము.

ఆంధ్రుల కాపులై, అశేష శేముషీ దురంధరులయి, రోగార్తులయిన ప్రజలకు మీ అమృత హస్తములతో ఆయురారోగ్యములను ప్రసాదిస్తూ, ఆనంద మనస్కులయిన మీ యందు సదాశివ స్వరూపమును తిలకించుట మా మహాభాగ్యమే.

నిత్యకల్యాణమూర్తియై అహంకారము క్రోధము, మోహములను జయించి సచ్చిదానందరూపుడయిన సదాశివుఁడు మీకు దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యాది సర్వశుభములను చేకూర్చుగాక యని వాంఛిస్తూ మీ షష్ఠిపూర్త్యుత్సవ శుభసందర్భము శుభాకాంక్షలను, అభినందనలను అందిస్తున్న

ఆర్య! గుంటూరు పురజన మందు కీర్తి
ఘనముగా నెక్కిన సుగుణి! వినయపూర్వ
కాభివందన శతములు నందుకొనుము
శ్రీ సదాశివరాయ! విశిష్ట చరిత!

– డాక్టరు జె. వి. జి. కృష్ణమూర్తి

## కల్యాణతోరణము



*ఒక ప్రజాబంధువునకు*
*ఒక సాహితీప్రియునకు*
*ఒక సేవాతత్వమునకు*
*ఒక సదాశయునకు –*

షష్టిపూర్తి సన్మాన వేడుకలు జరుపుకునేందుకు ఊరూ, వాడా నడచి వచ్చింది, సంబరపడింది.

గ్రామగ్రామాలనుండి తండోప తండాలుగా తరలివచ్చారు. 23-3-1985 సాయంత్రం ఆరు గంటలకు గుంటూరు లక్ష్మీపురంలోని శ్రీపాటిబండ్ల సీతారామయ్య హైస్కూలు ఆవరణ షష్టిపూర్తి వేడుకలు తిలకింప వచ్చిన వారితో కిటకిటలాడిపోయింది. డాక్టరు జయప్రదాంబ, సదాశివరావు దంపతులను వేదపఠనాల మధ్య మంగళవాద్యాలతో పూర్ణకుంభ మర్యాదలతో వేదికవద్దకు తీసికొని రాగానే అభిమానులు డాక్టరు దంపతులను పూలమాలలతో ముంచెత్తారు.

అభిమానులు ఇష్టపూర్తిగా కనులపండువుగా జరుపుకొనే షష్టిపూర్తి సన్మాన విషయంలో ఆలోచన దశనుండి ఆచరణ దశవరకు జరిగిన కృషిని సన్మాన సంఘం తరఫున డాక్టరు ముద్దన హనుమంతరావు గారు సంగ్రహంగా వివరించి, ఆ కృషిలో తనకు సహాయసహకారాలు అందించిన అందరికీ కృతజ్ఞతలు తెలియజేసాడు.

ఏ రంగంలో అయినా తాము పలికే పలుకును శాసనం చేయగల లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావుగారు తమ అధ్యక్షోపన్యాసంలో డాక్టరు సదాశివరావుగారి దీక్షాదక్షతలను సమీక్షించి వారిలోని మానవతాదృక్పథాన్ని శ్లాఘించారు. సాహితీ రంగంలో, వైద్యరంగంలో ఎందరో యువకులు వారందించిన ఉత్తేజాన్ని గుర్తుకుతెస్తూ సమాజంపట్ల కర్తవ్యాన్ని గుర్తెరిగిన సదాశివరావుగారి వంటి వ్యక్తుల అవసరం రాజకీయరంగంలో నేడెంతో కలదన్నారు. డాక్టరు సదాశివరావుగారి శక్తి సామర్థ్యాలను, సేవాసహకారాలు సమాజానికి ఇబ్బడి ముబ్బడిగా లభించాలని ఆకాంక్షించారు. డాక్టరు దంపతుల ఆదర్శ జీవితాన్ని ప్రశంసించారు.

ఉభయ భాషాప్రవీణులు, పండిత చిన్నము రామయ్య చౌదరిగారు "సన్మానపద్య ప్రసూనాంజలి"ని సమర్పించారు. పిమ్మట పురప్రముఖులు, వైద్యులు, సాహితీవేత్తలు, సంఘసేవకులు,, రాజకీయవాదులు... వారూ వీరూ అనేమిటి సమాజంలో అన్నిరంగాలకు చెందినవారు డాక్టరు దంపతులను సుమహారాలతో అలంకరించి వారి ఆనందాన్ని ప్రకటించుకొన్నారు. పూలమాలల సమర్పణ కార్యక్రమమే దాదాపు గంటసేపు నిర్విరామంగా కొనసాగటం ఆశ్చర్యాన్ని కలిగించింది. డాక్టరు సదాశివరావుగారిని గురువుగా భావించుకొనేవారు, సంభావించుకొనేవారు కొందరు సతీసమేతంగా డాక్టరు దంపతులకు సత్కారాలు, పాదాభివందనాలు చేసారు.

నాగార్జున విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టరు కొమ్మారెడ్డి రాజారామమోహనరావు గారు "అభినందన చంద్రిక" ను ఆవిష్కరిస్తూ వారికీ, సదాశివరావుగారికీ మధ్యగల సామ్యములను పేర్కొంటూ వారిరువురూ రైతుకుటుంబాల నుండి వచ్చిన వారమేనని, జనరల్ సర్జరీలో ఎం.ఎస్. చేసి వైద్యవృత్తిని చేపట్టిన వారమేనని, చలసాని కుదురు నుండే కన్యలను ఎన్నిక చేసికొని ఇరువురమూ వివాహమాడటం జరిగిందనీ చమత్కారంగా వివరించారు. డాక్టరు సదాశివరావు గారి జీవితం ఇంత జయప్రదం కావటానికి డాక్టరు జయప్రదాంబ గారి కీలకమైన పాత్ర మరువరానిదని నొక్కి చెప్పారు.

తనకు తానే గొప్పవాడిని కావాలనో, ధనాన్ని లెక్కలేనంత ఆర్జించాలనో స్వార్థచింతన చేయకుండా తన వద్దకు వచ్చిన యువడాక్టర్లకు శిక్షణతోపాటు, ఉత్తేజాన్ని, ధైర్యాన్ని అందించి పల్లెల్లో, పట్టణాలలో వారిచే నర్సింగ్ హోమ్లు నెలకొల్పేటట్లు చేసి వైద్యరంగానికి ఎనలేని సేవచేసారని పేర్కొన్నారు. తన చుట్టూ వున్న వారిని పైకి తీసుకువచ్చే ప్రత్యేకమైన సుగుణమే వారిని విశిష్టవ్యక్తిగా తీర్చిదిద్దిందని కొనియాడుతూ, అటువంటి వ్యక్తిని అభినందిస్తూ వెలువరించిన సంచికను ఆవిష్కరించినందుకు ఎంతో గర్వంగా, ఆనందంగా ఉందని సభాసదుల కరతాళధ్వనుల మధ్య ప్రకటించారు.

కట్టు, బొట్టు, భాష, భావం వక్రత సైరింపలేని కవి పురందరులు, సహస్రచంద్రదర్శనములు గావించిన "తెనుఁగు లెంక" శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు ఆశీర్వచనం పలకటానికి సభ నలంకరించటం వల్ల షష్టిపూర్తి సన్మానసభకు నిండుదనం చేకూరిందని అందరూ భావించారు. "మూడుకోట్ల ప్రజలు మూగిన యింటిలో మంచిపీట లెంతమంది కుండు" అనుకొని సైరణ చూపి కీర్తికోపిన సదాశివరావుగారి వట్ల తుమ్మల వారికి ఎంతటి గౌరవాభిమానములో! "పదవి కంటే, మేడల కంటె, పసిడి కంటే మానవీ యమ్ము పన్నన్న మాట నెంచి" పరుగులు తీసే డాక్టరు గారికి ఒక చక్కని, చిక్కని చంపక మాలికను సమర్పించారు.:

విద్యారంగంలో అనేక ఉన్నత, ఉత్తమ పదవులను నిర్వహించి వాటికి వన్నెతెచ్చిన విశ్వవిఖ్యాత తత్త్వవేత్త ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు క్లుప్తంగా మాట్లాడుతూ డాక్టరు సదాశివరావుగారు విద్యార్థులకు, బీదలకు వైద్యసహాయం అవసరమైతే ఉచిత వైద్యసహాయం అందించటంలోని ప్రత్యేకతను, వారి ఆధ్వర్యములో నిర్వహింపబడుచున్న సాహితీ సదస్సు విశిష్టతను, విద్యారంగానికి చేసిన ఎనలేని సేవను కొనియాడారు.

పాలనాదక్షులుగా పేరెన్నికగన్న డాక్టరు డి. జగన్నాథరెడ్డిగారు ప్రసంగిస్తూ డాక్టరు సదాశివరావు గారు ఇందరి మన్ననలను పొందటములోని ఆంతర్యాన్ని వివరించారు. ప్రతిభావంతమైన విద్యార్థి జీవితాన్ని గడిపి వృత్తిలో నీతినియమాలకు కట్టుబడి, త్వరితగతిని నిర్ణయం తీసికొనగలిగిన అమోఘమైన మేధాసంపత్తితో అలరారుతూ విరామమెరుగక నిరంతరం పరిశ్రమించే గుణాలే వారిని ఉన్నతస్థితికి తెచ్చాయని, ఆనాడే కాదు, ఈనాటికి గూడ "అరుగో డాక్టరు దంపతులు" అంటూ ప్రజల హృదయాలపై చెరగని, తరగని ముద్ర వేయగల్గినందుకు ఎంతగానో వారిని అభినందించారు.

డాక్టరు జగన్నాథరెడ్డిగారి నుండి ఒక మెచ్చుకోలు మాట పొందాలంటే ఎంతకష్టమో తెలిసినవారు సభికులలో చాలామంది డాక్టరు జగన్నాథరెడ్డిగారి ప్రసంగానికి అచ్చెరువంది డాక్టరు కాసరనేని దంపతుల పుణ్యమే పుణ్యమని భావించు కొన్నారు.

బాల్యం నుండి తమ స్నేహాన్ని డాక్టరు సదాశివరావుగారితో పంచుకొంటూ వచ్చిన డాక్టరు జె. యతిరాజులుగారు సహపాఠిగా, సహోద్యోగిగా వారి జ్ఞాపకాలను కొన్నింటిని అందించారు. విద్యార్థి దశనుండి సదాశివరావుగారు ఏకసంధాగ్రాహియనీ, అంతేగాకుండా తక్కువ మాటల్లో ఎక్కువ వివరణ యివ్వగలశక్తి ఆయనలో కలదని అంటూ, ఎలాంటి సంకట పరిస్థితికి రోగిని లోను గానివ్వకుండా – "అరే! అప్పుడే ఆపరేషన్ అయిపోయిందా ?" అని ఆశ్చర్యపడే అంతవేగంగా, సులువుగా శస్త్రచికిత్సను నిర్వహించటంలో డాక్టరు సదాశివరావుగారు అందెవేసిన చేయి అని అభివర్ణించారు. కానీ కట్నం లేకుండా వివాహమాడిన వారి ఆదర్శగుణాన్ని ఎంతగానో కొనియాడారు.

ఉపన్యాస చక్రవర్తి, కృష్ణా జిల్లా పరిషత్ అధ్యక్షులు సుంకర సత్యనారాయణగారు ఉపన్యసిస్తూ హృదయపు లోతులనుంచి వెలికి తీసిన అనురాగంతో మహోన్నత మహామనీషికి జరిగే ఈ సన్మాన వేడుకలను చేర్చి, పేర్చి, కూర్చి మరపురాని, మరువలేని మనోజ్ఞమైన అనుభవంగా కలకాలం తమ జీవితంలో పదిలపర్చుకొంటా మన్నారు.

డాక్టరు సదాశివరావుగారిని చూచిన తరువాత వేమన పద్యంలోని పుణ్యపురుషుడు ఎవరో స్పష్టంగా అర్థమైనదన్నారు. ప్రజావైద్యశాలకు నిజమైన అర్థాన్ని డాక్టరు సదాశివ రావుగారి ప్రజా వైద్యశాలలోనే కనుగొనగలిగామన్నారు. డాక్టరు సదాశివరావుగారిని ఒక కారుణ్యమూర్తిగా, ఎడారిలో ఒయాసిస్ గా అభివర్ణించారు. ప్రవృత్తిరీత్యా డాక్టరుగారు రాజకీయవృత్తిలో ఆస్థాన విద్వాంసుడు కాలేదని చమత్కరించారు. సదాశివరావు గారు మంత్రి కావటం కంటే మంత్రులకు మంత్రాంగాన్ని నేర్పే వ్యక్తిగా నిలిచిపోవాలనే తాము కోరుకుంటున్నామన్నారు.

దేనినైనా ఓర్చుకొనగలిగిన శక్తిసంపన్నులయిన డాక్టరు సదాశివరావుగారు ఈ ప్రశంసాపరంపరకు తట్టుకోలేక తబ్బిబ్బయి నట్లు కనుపించారు.

వినమ్రపూర్వకంగా వారివ్వగలిగిన సమాధానంతో జీరబోయిన వారి గొంతు స్పష్టంగా విన్పించింది. చిత్తశుద్ధితో వైద్యవృత్తిని చేపట్టాలనే ధ్యేయంతోనే వారు కృషి చేయటం జరిగిందని చెప్పుతూ, జబ్బు తగ్గిపోయి ఇంటికి వెళ్తూ రోగి వచ్చినప్పుడు. అతని ముఖంలోని ఆనందం తనకెంతో తృప్తి నిచ్చేదన్నారు. వారిని ఆశీర్వదించినవారికి, అభినందించిన వారికి కృతజ్ఞతలు తెలియజేసారు.

తొలుత రావెల సాంబశివరావుగారు స్వాగతం పలకగా పులిచర్ల సాంబశివరావుగారి వందనసమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది.

❖ డాక్టరు సదాశివరావుగారి షష్టిపూర్తి మహోత్సవము జయప్రదంగా జరగాలని ఆకాంక్షిస్తూ
❖ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు,
❖ వ్యవసాయ, పశుసంవర్ధక శాఖామాత్యులు శ్రీ ఆర్. రాజగోపాలరెడ్డి,
❖ వైద్య ఆరోగ్య శాఖామంత్రి శ్రీ ఎం. ఎస్. ఎస్. కోటేశ్వరరావు,
❖ మాజీమంత్రి కందుల ఓబులరెడ్డి,
❖ రాష్ట్ర లోక్ దళ్ పార్టీ అధ్యక్షులు సర్దారు గౌతు లచ్చన్న,
❖ గవర్నమెంటు చీఫ్ విప్ శ్రీ కె. వి. నారాయణరావు,
❖ జస్టిస్ పి. ఎ. చౌదరి,
❖ శాసనసభ్యులు శ్రీ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు,
❖ ఆంధ్ర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు శ్రీ ఎం.ఆర్. అప్పారావు,
❖ నాగార్జున విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు డాక్టరు బి. సర్వేశ్వరరావు,
❖ సర్వశ్రీ గుంటుపల్లి శ్రీనివాసరావు, ఎస్. రాజేశ్వరరావు, నరసింహరాజు, కె. వి. చలపతిరావు, డాక్టరు నారాయణరావు, డాక్టరు కృపారావు, ఆంధ్రప్రదేశ్ డిసేబుల్డు వెల్ఫేర్ అసోసియేషన్ ప్రెసిడెంటు శ్రీ కె. వెంకటరావు, డాక్టరు ఉమామహేశ్వరరావు ప్రభృతులు ఎందరో తమ సందేశాలను పంపించారు. ★

## నీరాజనము

- వసంత శాయికృష్ణ ప్రసాద్,
అధ్యక్షులు, గుంటూరు జిల్లా తెలుగుయువత

డాక్టరు గారు సహృదయులు, సాహితీప్రియులు, ప్రముఖ శస్త్రవైద్యులు. ప్రస్తుత సమాజానికి వైద్యము అవసరమని కాబోలు రాజకీయరంగములో ప్రవేశించినారు. డాక్టరుగారి వంటి జాతీయవాది మన శాసనసభలో ఉండడం శాసనసభకే అలంకారము.

సదాశివరావుగారు నిండుకుండలాగ తొణకరు. ఆచి, తూచి మాట్లాడటం వారికి వెన్నతోపెట్టిన విద్య. ఆశ్రితజన రక్షకుడు, ఆరోగ్య ప్రదాత, వైద్యవృత్తిలో అందెవేసిన చేయి.

తిరుగులేని సర్జన్ గా పేరుప్రతిష్ఠలు సంపాదించుకొని, ఊపిరి సలుపని వైద్యసేవలో మునిగితేలుతూ, సాహితీ సదస్సును నెలకొల్పి సాహిత్యాభివృద్ధికి కృషిచేసిన మహామనీషి. బహుముఖ ప్రజ్ఞగలిగిన సదాశివరావుగారు మా నియోజకవర్గము నుండి శాసనసభకు ఎన్నిక అయినందుకు మేమెంతో గర్వపడుచున్నాము.

శ్రీ సదాశివరావుగారు నిరాడంబరులు, నిగర్వి, సౌజన్యమూర్తి. పెదకూరపాడు నియోజకవర్గమునుండి యెవరైన పనిమీద డాక్టరు గారింటికి వచ్చినప్పుడు వారు,వీరు అనిగాని, చిన్న,పెద్ద అని గాని వ్యత్యాసము లేకుండ అందరిని ఒకే రీతిగా, ఆదరముతో పలుకరించు నిష్కల్మషహృదయులు. వారి గుణగణములు యువకులకు ఆదర్శప్రాయము.

డాక్టరుగారు ప్రజలకు మరింతగా సేవలను అందించుటకు ఇంకా ఉన్నతస్థానాలను అధిష్ఠించాలని షష్టిపూర్తి ఉత్సవ సందర్భమున వారికి నా భక్తిపూర్వక నీరాజనములు అర్పించుచున్నాను. గౌరవనీయ డాక్టరు దంపతులకు ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాను.

## కృతజ్ఞతలు

- డాక్టరు కాసరనేని సదాశివరావు

(షష్టిపూర్తి సభలో చెప్పాలని చెప్పలేక పోయిన మాటలకు అక్షరరూపం ఇవ్వాలని ప్రయత్నం.)




జన్మ యిచ్చిన తల్లి భాగ్యమ్మ గారికి నమస్కరిస్తూ, తండ్రి రామశాస్త్రులుగారిని, పెంచి పెద్దజేసి మరణశయ్య మీద గూడ మనుమని (నా) చదువును గురించే ఆరాటపడిన తాత పిన్నమనేని వీరయ్య, అమ్మమ్మ బసవమ్మగార్లను, ఉన్నతవిద్యలో ప్రవేశపెట్టిన మేనమామ పిన్నమనేని సూరయ్య గారిని, వైద్యవిద్యలో ప్రవేశించటానికి ప్రోత్సాహమిచ్చిన పెద్దలు, మా మేనమామ స్నేహితులు శ్రీయుతులు జి. వి. పున్నయ్యశాస్త్రి, సింగం పుల్లారెడ్డి, ఘంటా శేషయ్య గార్లను ఈ సందర్భంలో స్మరించుకొంటున్నాను.

అక్షరాభ్యాసం చేసిన కప్పగంతుల రామస్వామి గారి నుండి కాలేజి ప్రిన్సిపాల్ బుద్ధిరాజు రామచంద్ర రావుగారి వరకు, మెడికల్ కాలేజి అధ్యాపకులందరికీ నా భక్తిపూర్వక కృతజ్ఞతలు.

ఆడపిల్లలను హైస్కూలు విద్యకు పంపటమే అబ్బురమైన ఆ రోజులలో వారి అమ్మాయిని ఎం. బి. బి. ఎస్. చదివించగలిగిన సంస్కృతీ సంపన్నులు మా అత్తమామలు చలసాని తులశమ్మ, లక్ష్మీనారాయణవర్మ గారలను భక్తి,గౌరవములతో స్మరించుకొంటున్నాను. మా తాత ముత్తవల లాగే మా శ్రీమతి జయప్రదాంబ అమ్మమ్మ వెల్లంకి సుబ్బమ్మగారు ఆమె విద్యకు మూలకారణం గావటం యాదృచ్ఛికం కాదేమో ?

మా తండ్రి రామశాస్త్రులు దుష్టచింతన గాని, పరుషవాక్కు గాని తెలియని సజ్జనులు. మా తల్లి భాగ్యమ్మగారు అభిమానమే ధనముగా, సంతానమే సంపదగా భావించే వ్యక్తి. తన బిడ్డలుగూడ అదే జీవితవిలువలను పాటించాలని కోరుకుంటారు. బంధువర్గం నా చిన్నప్పటి నుండి నా పట్ల అనురాగం జూపేవారు. తమ్ముళ్ళు, చెల్లెళ్ళు బావమరుదులు – ఎల్లప్పుడు మా శ్రేయస్సును గోరుతూ ఉంటారు.

కం॥ ఉన్నట్లయుండ నద్దరి
కిన్నరులను నావచేర్చు క్రియ వెసఁదాం బో
కున్నట్లు యుండి కాలం
బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసముఁ దెచ్చున్." (ఆముక్తమాల్యద 2-79)

మిత్రులు షష్టిపూర్తిని గురించి ప్రస్తావించినప్పుడు నాకు పై పద్యం గుర్తుకు వచ్చింది. వ్యక్తి జీవితంలో అరవై సంవత్సరాలు ఎక్కువ కాలమే కావచ్చు గాని అనంతమైన కాలంలో 60 సంవత్సరాలు బహు స్వల్పం.

షష్టిపూర్తి ఉత్సవాలు జరుపుకోవటం తెలుసు. జీవితం సాఫీగా నడిచి, చెప్పుకోదగిన దేమైన సాధించినవారు తామే యీ ఉత్సవం జరుపుకొంటారు. కవులకు, పండితులకు వారి అభిమానులు జరుపుతూ వుంటారు. నాకెందుకు జరపాలనుకొన్నారో ఆ సంగతి మిత్రులకే తెలియాలి. నాకు మోమోటం ఎక్కువన్న సంగతి నాకూ, నా మిత్రులకు తెలుసు. అందువల్లనే నేటి ఉత్సవం. కాలం తెచ్చిపెట్టే మోసం ఇంత ఆనందదాయకమైతే అందరూ ఆహ్వానింపదగినదే కదా?

ఇంతవరకు ఈ సభలో పెద్దలు మమ్మల్ని గురించి చెప్పిన మాటలన్నీ నిజంకాదని చెప్పేటంతటి వినయసంపన్నుడను గాను. మర్యాద కన్నా ఆ మాట అనాలంటే గూడ చిక్కు వస్తుంది. అంతమంది మర్యాదస్తులను అబద్ధాలకోర్లుగా చిత్రించటమే అవుతుంది. ఇటువంటి సందర్భాలలో అతిశయోక్తులు తప్పని సరి. అవి మినహాయించి, అందులోని యధార్థం గ్రహించాలని మనవి చేసికొంటున్నాను.

నన్ను స్తోత్రప్రియుడని కొంతమంది అంటుంటారు. ఇది పూర్తి అపవాదు కాదు. నిజానికి స్తోత్రప్రియులు కానివారు ఎవరైనా ఉన్నారా ? అని సందేహం. "You are above flattery"
అనేదే
biggest flattery అనుకుంటాను.

నా జీవిత గమనాన్ని చూస్తే నాకు సంతృప్తి ఉన్నది.

సింహావలోకనం:

నేను పుట్టింది మధ్యతరగతి కుటుంబంలో (lower middle class) కష్టపడి పనిజేసికొంటే, కూటికి, గుడ్డకు లోటు లేనటువంటి కుటుంబం మాది. మా తల్లిదండ్రులకు నేను మొదటి సంతానం. తాత ముత్తవలకు మొదటి మనవణ్ని. అంటే రెండు కుటుంబాలు కావాలని ఎదురుచూచిన బిడ్డనే. ఊహ తెలియకముందే తాతగారింటికి వెళ్ళటం, 18 సంవత్సరాల వరకు అక్కడే పెరగటం జరిగింది.

మా మేనమామ పిన్నమనేని సూరయ్యగారు. జాతీయోద్యమంలో పాల్గొని 1941 జనవరిలో "వ్యక్తి సత్యాగ్రహం" చేసి జైలుకు వెళ్ళారు. ఆయన తరచుగా దేశవ్యాప్తంగా కాంగ్రెసు సభలకు హాజరయ్యే వారు. చదువు విలువను గుర్తించి ఆయన నన్ను 1935 లో ఇంగ్లీషువిద్యలో చేర్పించి 1936 లో గుంటూరు హిందూ హైస్కూలులో మూడో ఫారంలో చేర్పించారు. చదువుకోవటం ఒక అదృష్టంగా నేను భావించాను. బడి అంటే ఇష్టం. చదువంటే భయంగాని, పరీక్ష తప్పుతానేమోననే అనుమానం గాని ఉండేవి కావు. సెలవుల్లో తప్పకుండా పొలం వెళ్ళేవాడిని. వెళ్ళటమంటే ఓపినంత పనిచెయ్యటమే. తప్పనిపించేది గాదు, సహజమనే అనిపించేది.

నాకు తగిన ప్రతి సందర్భంలోను అమ్మమ్మ, తాతయ్యలే జ్ఞాపకం వస్తారు. మా అమ్మమ్మ జీవితంలో అన్ని సందర్భాలకు సరిపడే చక్కని సామెతల్ని ఉపయోగించేది. మనం కష్టపడిందే మనకు అక్కరకు వస్తుందని నమ్మేవారు తాతయ్య.

మా స్వగ్రామం తక్కెళ్ళపాడునుండి గుంటూరు హిందూ హైస్కూలుకు రాను పోను. 6 మైళ్ళు నడిచి వచ్చేవాణ్ణి. హైస్కూలు దశలో శిష్ట్లా హనుమత్ శాస్త్రి గారు. మైలవరం వెంకటరామయ్యగారు నాలో విజ్ఞానబీజాలను నాటారు.

1940–42 ఇంటర్ ఫస్ట్ గ్రూప్. యం.పి.సి.తో చదివి ఫస్ట్ క్లాసులో పాసయ్యాను. పూర్ణ ప్రజ్ఞాచార్యులు గారు, బుద్ధిరాజు రామచంద్రరావు గారు, నా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దారు. బుద్ధిరాజు వారు నాపై చూపిన ఆపేక్ష, వాత్సల్యం మరపురానివి. చదువుపై నా ఆసక్తిని గమనించి ఆయన నాకు స్కాలర్షిప్ ఇప్పించారు. అంతేకాదు. మధ్యాహ్న విరామసమయంలో ప్రిన్సిపల్ గదిలో నాకు బోధించేవారు. గుంటూరులో పరుచూరి వీరయ్య గారు, తెనాలిలో వి. సుందరరామయ్యగారు అప్పట్లో ఈ ప్రాంతాలలో ప్రసిద్ధులైన డాక్టర్లు. డాక్టర్ని కావాలని. నాకు కోరిక కలిగింది. 1942 లో విశాఖ మెడికల్ కాలేజిలో చేరాను. వైద్యశాస్త్రంలో ఎక్కువమందికి కొరుకుడు పడని "అనాటమీ" (శరీర నిర్మాణశాస్త్రం) అంటే ఎక్కువ ఇష్టం. తరువాత సర్జరీ మీద ఎక్కువ ఆసక్తి ఏర్పడింది.

నేను మెడికల్ కాలేజిలో జేరకముందు కొద్ది సంవత్సరాలక్రితం ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అమెరికన్ శస్త్రనిపుణులు మేయో బ్రదర్స్ చనిపోయారు. వారిని గురించి జ్ఞాపకం జేసికొంటూ మా ప్రొఫెసర్లు గొప్పగా ప్రశంసించే వారు. కొంతమంది డాక్టర్లు తమ అన్నకు "మేయో క్లినిక్" అని పేరుపెట్టుకొన్నా... మేయో బ్రదర్స్ చికిత్స చేయటంలో సామాన్యులకు అందుబాటులో ఉండేవారు. వారి జీవితం నాకు ఆదర్శప్రాయంగా తోచింది. నా అమెరికా పర్యటనలో ప్రత్యేకంగా "మేయో క్లినిక్" ను సందర్శించాను.

ఆ కాలంలోనే పెన్సిలిన్, స్ట్రెప్టోమైసిన్ మొదలైన "యాంటిబయాటిక్స్"ను కనుగొనటం జరిగింది. వాటితో చికిత్సా విధానంలో అత్యద్భుత ఫలితాలు కనిపించాయి. భవిష్యత్తు ఆశాజనకంగా తోచింది.

జాతీయోద్యమం పైన మిక్కుటమైన అభిమానం ఉండేది. గాంధీజీని విశాఖపట్టణంలో దర్శించుకొన్నాను. గాంధీ, నెహ్రూ, పటేల్, జయప్రకాశ్ నారాయణ్ నా అభిమాననాయకులు. ఆంధ్ర నాయకులలో ప్రకాశం, రంగా గారలు నాకు మిక్కిలి యిష్టమైన వారు.

బాధల్లో ఉన్న తోటివారికి సహాయపడటం నాకు చిన్నప్పటి నుంచి ఉన్నది. సహాయం పొందినవారి నుండి ప్రత్యుపకారం ఎప్పుడూ ఆశించ లేదు.

1949 లో శ్రీమతి జయప్రదతో నా వివాహం జరిగింది. 14 నెలలపాటు ప్రభుత్వోద్యోగం చేశాను. 1951 లో యం.యస్. డిగ్రీ పొందాను. తరువాత ప్రైవేటు ప్రాక్టీసు ప్రారంభించాము. ప్రాక్టీసు ప్రారంభించిన తొలిదశలోనే పేషెంట్లు విరివిగా వచ్చారు. 1952 నుండి జూనియర్ డాక్టర్లకు నా చేతనైనంతవరకు తోడ్పడుతూ వచ్చాను. వారికి నేను ఇచ్చిన మెటీరియల్ సపోర్టుకన్నా మోరల్ సపోర్టు ముఖ్యం. అయినా జూనియర్ డాక్టర్లు చాలామంది నన్ను ఆత్మబంధువుగా భావించుకొన్నారు. అది వారి సౌజన్యం. గ్రామీణ ప్రజలకు అందుబాటులో ఉండేలాగ ప్రాక్టీసు ప్రారంభించమని జూనియర్లకు సలహా యిచ్చేవాణ్ణి.

ఎదుటివారి ఆలోచనలు, ఆందోళనలు, సమస్యలు ఓపికగా విని సహానుభూతి పొందగలను. ప్రతి మనిషి దగ్గరా, ప్రతి సంఘటన నుండి నేర్చుకొనగల మనే నమ్మకం నాకున్నది. నా కంటే విజ్ఞులైన వారినుండి మంచిని గ్రహించటానికి నే నెప్పుడూ సిద్ధమే.

"In every man there is something wherein I am to learn of him, and in that I am his pupil" అనే ఎమర్సన్ వాక్యం నాకు ఆదర్శం.

నా శ్రీమతీ, నేనూ ఒకే విధమైన జీవనదృక్పథం కలవారం. వివిధ విషయాలకు సంబంధించి స్పష్టమైన అభిప్రాయభేదాలు ఉన్నప్పటికి అవి మా జీవనస్రవంతికి అడ్డుకాలేదు. మేము ఉచిత వైద్యం చేశామని చెప్పే ఆస్కారం లేదు. రోగుల కష్టసుఖాలు కనిపెట్టి ఉన్నామని చెప్పగలం.

అదృష్టవశాత్తూ మా పిల్లలవల్ల మాకు ఏనాడూ సమస్యలు ఉత్పన్నం కాలేదు. వాళ్ళ చదువు సంధ్యలలోగాని, పెండ్లిండ్లలో గాని వారి యిష్టమే మా ఇష్టంగా జరిగాయి. మేము చదువుకొన్నందువల్ల విద్యాసంస్థలు నెలకొల్పినప్పుడు మాశక్తి కొలది సహాయ పడుతూ వచ్చాము.

నేను సాధారణంగా గంభీరంగా ఉంటాను గాని, రోగి పరిస్థితి దిగజారుతున్నప్పుడు తప్పనిసరిగా ఆందోళన చెందుతూ ఉంటాను. అది పైకి కనపడకూడదు గనుక గాంభీర్యం కొంత తెచ్చి పెట్టుకొన్నదే అవుతుంది.

"మానవసేవయే మాధవసేవ అన్నమాట మనసుకు పట్టినందువల్ల నా మనస్సు విగ్రహారాధనవైపు పోలేదు. బాల్యం నుండే అంటరానితనం సహించరానిదనీ, కులభేదాలు కృత్రిమమని అనిపించాయి.

చిన్నప్పటినుంచి రాజకీయాలంటే అభిరుచి ఉన్నప్పటికి Day to day Politics లో దిగాలన్న ఉద్దేశ్యం కలుగలేదు. 1975 లో ఇందిరాగాంధి "ఎమర్జన్సీ"ప్రకటించినప్పుడు Right thinking People మౌనంగా, అన్యాయాన్ని భరించటం న్యాయం కాదని పించింది.

భాషా సౌందర్యం, భావసంపద కలిగిన ఎటువంటి రచననైనా విడువకుండా చదువుతాను. 1963లో తుమ్మలవారి కావ్యాలను పఠించిన తరువాత, జాషువాగారి కవితామృతం చవిచూశాక, సాహిత్యవేత్తలతో గోష్ఠికార్యక్రమాలు ఏర్పరచితే బాగుండు ననిపించింది. "సాహితీ సదస్సు" ను మా ఇంట్లోనే 1966 అక్టోబరులో స్థాపించటం జరిగింది. ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ సాహిత్య వేత్తలు చాలమంది సాహితీ సదస్సులో పాల్గొన్నారు. ఒక దశాబ్దకాలం పాటు మిత్రుల ప్రోత్సాహంతో ఉత్సాహభరితంగా ఈ కార్యక్రమాలు నడిచాయి. కొందరు సాహిత్యవేత్తలు తమ రచనలను నాకు అంకితం చేశారు. ధనాశతో గాక వారు నాపైన అభిమానంతో కృతులను అంకితం ఇచ్చినందుకు వారికి కృతజ్ఞుణ్ణి.

నాకు జరిగిన సన్మానం నేను సాధించిన విజయాలకా? లేక సాధించలేకపోయినందుకా? అని అనుమానం వస్తుంది. నా జీవితం సాఫీగా సాగిందని చెప్పగలను. భవిష్యత్తులో ఇంతకన్నా ఉజ్జ్వలంగా జరుగుతుందని గాని, జరగాలని గాని నేను కోరుకొనటంలేదు. ఇంతకన్న ప్రశాంతంగా జరిగితే చాలు. ఓపిక ఉన్నంత వరకు నా వృత్తిధర్మం నెరవేర్చగలననే నమ్మకం ఉన్నది.

జీవితంలో చీకటివెలుగులు సహజం. ఎప్పుడు నవ్వుతూ, నవ్విస్తూ జీవించి, కన్నవారిని, పెంచినవారిని పరిచయస్తులందరినీ విషాదంలో ముంచిన మా ఆషా మరణం కన్నతల్లిని, కట్టుకొన్న భార్యను, తోడబుట్టిన వారిని, తన సంతానాన్ని దుఃఖంలో ముంచి అకాలంగా మరణించిన నా తమ్ముడు సత్యనారాయణ మృతి నా జీవితంలో తీవ్రమైన సంఘటనలు.

తండ్రి అకాలమరణంవలన 20 వ ఏట, విద్యార్థిగా నున్నదశలోనే కుటుంబ నిర్వహణ బాధ్యత తీసికోవలసివచ్చింది. ఆత్మస్థైర్యంగల తల్లి ఆ బాధ్యతలు నిర్వహించి, నాకు బరువు తగ్గించింది.

నాకు ఎక్కువ సంతృప్తిని గలిగించేది– జబ్బు నయమైన రోగి ముఖంలో కనుపించే ఆనందం. బాగ మానసికాందోళన కలిగించేది – రోగి పరిస్థితి క్లిష్టంగా ఉండి వైద్యపరంగా ఏమి చేయలేనప్పుడు.

ఆలోచించే ప్రతిమానవునకూ జీవితప్రారంభంలో స్పష్టమైన అవగాహన లేనప్పటికి, కాలక్రమేణ తనకు గలిగే అనుభవాలను బట్టి తన జీవనదృక్పథం స్పష్టమౌతుందనుకొంటాను. బాధానివారణ అలవాటు అయింది. తోటి మానవుని కించపరచకుండా, వ్యక్తి గౌరవాన్ని కాపాడుతూ, కష్టకాలంలో చేతనైనంత సహాయ మందించటమే నా జీవితలక్ష్యం.

సంపాదించిన ధనముకన్నా, హోదాలకన్నా, ఆశయాలను ఎంతవరకు ఆచరించామన్న దృష్టితోనే మన జీవితాలను అంచనా వేసికొనటం సరైన పద్ధతి అనుకొంటాను. ఆ దృష్టితో జూచినప్పుడు మాకు సంతృప్తి కలుగుతుంది.

శ్రీయార్లగడ్డ వెంకన్న చౌదరిగారి భూరి విరాళంతో ప్రారంభించిన "కేన్సర్ హాస్పిటల్" త్వరగా పూర్తిచేయవలసిన బాధ్యత నాపై ఉన్నది. దాతల సహకారంతో త్వరగా పూర్తిచేయాలని ఆశిస్తున్నాను..

రాజకీయంగా నామీద విశ్వాసముంచిన ప్రజానీకానికి చేతనైన సేవచేయాలనే సంకల్పంతో ఉన్నాను. మా నియోజకవర్గంలో నీటివనరులు 'తాగటానికి, వ్యవసాయానికి' ఉన్నత విద్యాసౌకర్యాలు, వైద్యసదుపాయాల అభివద్ధికి కృషి చేయాలనుకొంటున్నాను.

*"ఒరులేయవి యొనరించిన*
*నరవర, యప్రియము తన మనంబునకగు, దా*
*నొ రులకు నవి సేయకునికి*
*పరాయణము పరమ ధర్మ పథములకెల్లన్."* అనేది నేను విశ్వసించే జీవన సూత్రం.

మేము చేసిన స్వల్పమైన సేవలకు విశాలహృదయంతో యువకులు ఇంత ఘనమైన సన్మానం చేయటాన్ని గమనిస్తే యువతరంలో సామాజిక చైతన్యానికి లోటు లేదనీ, దేశానికి మంచి భవిష్యత్తు ఉంటుందని నాకు నమ్మకం కలుగుతుంది.

సభకు విచ్చేసిన పెద్దలు, మిత్రులు. అభిమానులందరికీ మా కృతజ్ఞతలు.



భాగం – 2

## దీవనలు

అఱువది యేండ్లు నిండె భిషగగ్రణి కాసరనేని కున్నచో
వెఱఁగు జనించుఁ గాని యిది విశ్వసనీయముగాని పల్కుగా;
దిరువది ముప్ప దేండ్ల యువ కీతఁడు జోడుగ నేలతోఁచు ! నీ
గఱుప మొగమ్మునన్ ముదుత కన్పడ దేమి ! జరాపిశాచి యీ
నరుదరి కేలరా; దనిన నా మది యిట్లు వచించు "నో కవీ
శ్వర ! యితఁ డర్థకామములు బానిస మొల్లఁ డనామయ వ్యథా
భరమునఁ గ్రుంగు మానిసికి బంధువుగా నుపకర్తృమౌళిగా
శరణముగా నలంగు; మనుజత్వము సత్వము నాదరించు; సత్
పురుషులు రోయు కోరికల పొంతకుఁ బోఁడు సదాశివుం డితం
డెఱుఁగును దెల్గుతీపి, సుకవీంద్రుల గోష్ఠికి నారటించు, నే
యొరపిడి వచ్చినన్ విడువనొల్లక హో ! ప్రతి భానువార మ
బ్బురమగు సాహితీ సభకుఁ బూను, జగద్ధిత కావ్య రాజముల్
మెఱయు( ప్రకటించు )ను, దల్లిబాస కెది మే లదినేతకు వేలువేలుగా
సిరులను వెచ్చ పెట్టు, నుతి చేసిన నుబ్బఁడు నింద సల్పినన్
గఱకరి కాఁడు, నమ్రతకు గాదిలి తావు; జయప్రదాంబ యీ
సరసుని రాణి యౌటయును సంస్తుతిపాత్రము, తోడి వెజ్జుగా
నిరుపమశౌచమూర్తిగ ననేక విధమ్ముల నీమె భర్తకున్
గరిమ నొసంగె, సంఘ మిది గాంచి కరంగి తెలుంగు దేశపుం
బరువున కండగా నగద (అగదము– మందు)పండితు నీ శివరావు నెన్ని సం
బరపడి, లోక సేవఁ గడుఁ బండిన కాసర నేని ధన్యతా
సురుచిర జీవనుండు జయసుందరుఁడై మహనీయ గౌరవ
స్ఫురణములన్ శతాబ్దములు భూరిసుఖంబుల నందుఁ గాక ! సా
గరమున రేఁగు ఫేనమును గప్పుర బోగి (ఒక జాతి మేలి వడ్లు) పసాదమున్ మరుత్
పుర నటదాపగన్ భుజగ భూష ణ మన్కిని శారదాభ్రమున్,
సరసిజ గర్భువార్వమును జంద్రిక నింద్రుశరిన్ బటీరమున్
విరిసిన మల్లియన్ బడగవిప్పిన శేషు నిజప్రభన్ నిరా
కరణ మొనర్చు కీర్తి పొసఁగన్ బరితృప్తి నెసంగుఁ గాక యీ

నెఱసరి (దిట్ట) మడన్ గనెడి నేఁటి కిశోరులు మేటి కర్జముల్
నెఱపి గణేయ(గణ్యము) పీఠముల నిల్తురు గాక, నరుండు సేవలన్
మరిగిన నాఁడే యావి దెస మక్కువ చూపిన నాఁడె మెప్పులన్
గొఱలు (ప్రకాశించు) నటన్న గుట్టు గనుగొందురుగాక

"తెనుంగు లెంక నాఁ దీవనలు పండునుగాక శుభాకరమ్ములై.

**కాసరనేని దంపతులు**
**కాసులకంటెఁ బ్రజాసపర్యకున్ ★ వాసి యొసంగి రేపవలు**
**వందురు వందల వేల రోగులన్ ★ గాసికి దవ్వొనర్చి నవ**
**కాంతి సమగ్రులఁ జేసి ధన్యతా★ భాసురు లౌట సజ్జనుల**
**పాలిటికిన్ శుభవార్తయె తగున్.**

సాహిత్యాచ్చిన, జన– తా సేవానిష్ఠ, వైద్య దర్శన మర్మ
శ్రీ సిద్ధియు రాణించుట– కాసింతుము నేఁడు విద్వ దభినంద్యమతీ !

"తెనుఁగులెంక – శ్రీ తుమ్మల సీతారామమూర్తి

## భద్రంతే

శ్రీంకార సిద్ధ – మహిత
హ్రీంకార నివాస రాగ రేఖారమ్య
క్లీంకార విలాసాంచిత
శాంకరి మీ కెపుడు సుఖము శాంతి నొసగుతన్.




గుంటూరు ప్రాంతమందు జనకోటి సదాశివరాయ ! నిన్ను నిం
టింటను సేవతో వెలుగులీను సదాశివ మూర్తినందు రే
గంటలు కొట్టి పల్కెద సగర్వముగా నది – ఎల్ల వేళ నీ
వంటి రసజ్ఞు మెచ్చెదను – వర్ధిలుమయ్య ! చిరాయు రున్నతిన్.
ఆగ్రహ భీషణుండయి రయంబున నర్వది యేండ్ల వానిపై
ఉగ్రరథుండు దూకునట ఉద్ధతితో జపదీక్షితుల్ తపో
రుగ్రమణీయులైన బుధులున్ కవులిచ్చు మహాశిషమ్ము లా
ఉగ్రత మాన్చి శాంతి సుఖయోగము మీ కభివృద్ధి జేయుతన్ !

– డాక్టరు ప్రసాదరాయ కులపతి

## శుభపరంపరలు

అరువదేండ్ల వయసు నధిగమించుటయన్న
భారతమున సాధ్యపడనిమాట,
ఆ యదృష్ట యోగ మందర కబ్బునా ?
లోకహితము గోరు నీకె దక్క!–

వైద్యశాస్త్రమందు వర్ణన కెక్కిన
గౌరవమ్ము మిగుల కలదు నీకు
ప్రాణదాన మొసగు బాధ్యతలో, గొప్ప
పేరు కొందరికే లభింపగలదు !–

షష్టిపూర్తి మహోత్సవ సమయమన్న
అది పునర్జన్మమనిగదా ? ఆర్యవాక్కు
అందుకె పునర్వివాహ కార్యక్రమమ్ము
తప్పుకోలేము, పూర్వ సిద్ధాంతములను !...

ఆంగ్ల భాషయందు, ఆరి తేరినవారు
తెలుగుమీద మమత నిలుప బోరు
తెలుగుతీపి నిన్ను వలచి, విప్లవ భావ
బలము నొసగి, తోడు నిలిచెగాదె !...

నీవు డాక్ట రౌట, నీ భార్య, సోదరుల్
సుతులు, డాక్టరులుగ, శోభ గనుట
ఒక కుటుంబమందు, ఒనగూడెనన్నచో
బంగరునకు తావి పట్టినట్లే !...

జగతి కాసరనేని వంశమునబుట్టి
ప్రజల ప్రతినిధిగా గెల్పు పదవి గన్న
నాయకుడవు, సదాశివరాయ ! నీవు
అస్తు ! శుభమస్తు, దీర్ఘాయురస్తు ! నీకు !...

–"కళా ప్రపూర్ణ" కొసరాజు రాఘవయ్య చౌదరి

# సదాశివమ్

అతడు పదుగురి మేలు కహర్నిశమ్ము
మనము తనువుల వెచ్చించు మానవుండు
వృత్తి వైద్యమ్ము, సరసప్రవృత్తి సాహి
తీ పరిమళమ్ము వ్యావృత్తి దేశ సేవ.

ఆత్మకొక సంస్థ వ్యక్తిత్వ మాత్మ నెంచు
శక్తియై నిల్చు నిత్య మే సంస్థ కేని
జనత మెచ్చిన నేత సౌజన్యమూర్తి
స్నిగ్ధయశుదు డాక్టరు సదాశివుడు నిజము,

పల్లె పొలమున ప్రభవించి, పసదలిర్చి,
పట్టణోద్యాన వాటిక వాసి కెక్కి,
రాష్ట్ర శాసన భవన విక్రాంతి యగుచు,
పరిమళించె సదాశివు ప్రాభవమ్ము !

అఱుపదులకు మించిన యోవనుండు
ఇల ననుభవమ్ము పండిన వృద్ధమూర్తి
రాజకీయాల జగజెట్టి! తూచిపలుకు
పలుకు విలువలు తెలిసిన పండితుండు.

ప్రజల సేవించి తరియించి ప్రతిభ గాంచి
పదవికొక వన్నె పచరించి భావితరము
వారి కాదర్శమూర్తియై వులుగాక వాఅలు గాంత
ధాత్రి కాసర నేని సదాశివుండు.

సిరుల జవరాలి కిలకిలల్, గిరితనూజ
మృదుల దరహాస చంద్రికల్, మేలిపలుకు
లమ్మ పుక్కిటిగమగమల్ హాయిమీరి
చెలగుగా వుడే మన సదాశివునియింట.

– అబ్బరాజు శ్రీనివాసమూర్తి

# ఎలా ? !



చంద్రుని అందచందాలను
చంద్రుని ఒయ్యారంగా విడమర్చాలనే
తీరని ఆ తారక మిలమిలలు
అంతో యింతో అర్థమయ్యే దెలా ?

మానవతా మధురజలం
అందరికీ అందించాలని
ఎగిరే ఏతాము ఆరాటం
కొందరి కయినా అర్థమయ్యే దెలా ?

మఱ్ఱిచెట్టు మంచితనం
మరీమరీ చెప్పాలని
ఊగిపోయే ఊడ ఉబలాటం
అందరికీ అర్థమయ్యే దెలా ?

ఆ చేతి చలవే చలవని
ఆరోగ్యంతో గెంతే జనానికి
ఇదిగో 'క్రొత్త టానిక్' అంటూ
రుచి చూపించే దెలా ?

ఆత్మీయుణ్ణి గూర్చి
అందరితో పొగడటం ఎలా ! ?
అందని ఆ శిఖరాలను
అందుకోవాలంటే ఎలా ?!

– రావెల సాంబశివరావు

## మహతి

వాసరమా ! యొకింత నిలువంగదె ! యాపయి బోవవచ్చు, నో
పూ సరమా ! సుగంధములు పొంపిరి నింపి తె? మించు బోణివై
లాస రమా ! సుఖేలన విలాసము సల్పవె ! యెందు కేమిటే !–
కాసరనేని వంశ ఘన కంధి శశాంకుని షష్టి పూర్తికే !

భాసుర వైద్య పట్టపరిపాలన భాసుడు, సాహితీ రసో
ల్లాసుడు, మాతృ దేశీ సువిలాస విలాసుడు, దుర్జనైక దు
ర్వాసుడు, సత్కవీంద్ర జనరంజక రమ్యగుణైక వాసుడున్
వ్యాసుడు, చంద్రికా ధవళహాసుడు – కాసరనేని యీశుడౌ.

ఈ సుగుణమూర్తి మది నెంచిన యంత హొొయల్ వెలార్చు, వి
న్యాసము లొల్కుచున్ బరుగులందు, వసంతపు బంత ద్రొక్కి యు
ద్వాసన పల్కు– సిల్లులకు – వ్యాధిని పీడితు ప్రాణమున్, నిర
భ్యాసి కలంబునున్, గడు నభాగ్యుని జీవితజీర్ణ వృక్షమున్.

ఈ సుకవీంద్రు డింద్రుడు,(తెనుగు లెంక, తుమ్మల) సుహృజ్జనపాళి సురల్, సదస్యులు
ద్భాసి గణంబు, లాత్మజులు తగ్గణనాథులు సూ!, జయప్రదాం
బాసతి యంబయౌను, గొలువైన సదాశివుడే శివుండు, కై
లాసము గర్భపట్టణము, లాంఛన మీ మహతీ నినాదమా.

విద్యావైద్యకళా త్రివేణి జగద్విఖ్యాతుడై నట్టి యీ
హృద్యన్మూర్తికి, శుభ్రకీ ర్తికొక యెమ్మెల్యేపదంబా ! కడున్
జోద్యంc బియ్యది; రాజకీయముల యుచ్చుల్ చెంచి ఓసీ! అమా
త్యోద్యోగంబ ! సదాశివాఖ్యు దెస విద్యుద్వేశమై రాగదే !

– బండ్లమూడి సత్యనారాయణ,తెలుగు లెక్చరర్, ఏలూరు

# స్వాకాంక్ష

శస్త్రచికిత్సఁ బ్రశస్త గురుత్వమా
ప్రతి వైద్య మంది రారబ్ధి సాక్షి,
సత్సంప్రదాయ రక్షైక దీప్తి యా
కీర్తి మేదురము జే. కే. సి. సాక్షి
నిర్ధనచ్ఛాత్ర నిర్ణిద్ర ప్రోత్సాహమా
తరుణుడౌ నాడు సోదరుఁడు సాక్షి
సాహిత్య పరిపూర్ణ సాహితీ ప్రీతియా
ప్రథితమౌ సాహితీ సదసు సాక్షి.

చెప్పవలసిన గుణములుఁ జెప్పఁ దగ్గ
సాక్షులున్నవి – పద్యంబు చాలదిఁక;
షష్టిపూర్త్యుత్సవారంభ సమయమందు
శివముఁ బల్కెద శ్రీ సదాశివుని కొఱకు,

అఖిల వైభవాళి జయప్రదాంచితముగ
శ్రీ సదాశివరావు సుశ్రీల ప్రోవు
మఱియు నొక షష్టిపూర్తిని జరుపుకొనుత
మపుడు నిట్ల "ఈ వీడు" పద్యాళి నిడుత.

– డాక్టరు చేతవోలు రామబ్రహ్మం

"ప్రజ్ఞావాన్ లభ్యతే జ్ఞానమ్"
కవిత సానదీరె కాలమెంతో మారె
కర్షకుండు గ్రంథకర్త యయ్యె – –'కవిబ్రహ్మ'

## అభినందన మాలిక

ఆ లక్ష్మీపుర మొక అందాల వాడ
అందాల వాడలో అలరారు మేడ
ఆ మేడలోనే వైద్యశిఖామణులు
ఆమణుల హృదయాలు అనురాగ నిలయాలు.

ఆ కొత్తపేటలో వైద్యశాలలు చాల
అగుపించు చున్నవి తారకల వోలె
తారకమధ్యలో జాబిల్లి వోలె
ఒప్పుచున్నది మేటి ప్రజావైద్యశాల.

కెరటాల వోలె రోగులు వచ్చుచుండ
ఆరోగ్యవంతులై అరుగుచు నుండ
కీర్తి సౌరభము దిక్కులు నిండుచుండ
స్థిర ప్రజాసేవతో హృదయాలు నిండె.

నందమూరి నాయకత్వాన తెలుగుదేశం
ఉవ్వెత్తున లేచింది ఆంధ్రదేశం
వైద్యశిఖామణికి వచ్చింది ఆవేశం
శాసనసభ్యుణ్ని చేసింది ప్రజోద్దేశం.

ఈ షష్టి పూర్త్యుత్సవానంద వేళ
ఆ స్రష్ట కూర్చిన ఆమోద హేల
ఆబాల గోపాల పండితుల మ్రోల
వైభవమ్ముగ సాగె జగదీశు లీల.

చలసాని ఉషారాణి, ఆంగ్లోపన్యాసకురాలు

## భువనమాల – 'అష్టావధాని', "విద్వాన్" 'సాహితీ వ్యాకరణ' శిరోమణి

జీవ్యాత్ సుఖం ద్వితీయాం
షష్టిం శరదాం సదాంధ్ర సేవాం ప్రణయన్
కాసరనేని సదాశివ
'రావు' సుధీ స్సద్వితీయ ఈదృజయోంధ్రే ॥

ఎవని మహాంశువుల్ వెలుఁగు చెల్ల జగంబులయందు సర్వ వ
స్తువులకు నంధకారములు దూరము సేయుచు, సంప్రకాశ వై
భవము నొసంగు, నాతఁడు ప్రభాకరుఁ డెట్టు నిరామయాంగు నిం
బవిత మహిం బొనర్చి, నుతవైద్య సదాశివరావు నోముతన్.

రోగా స్తం కరణోచితౌషధరుఁడై రుణ్ణాళి నెవ్వండు నీ
రోగాంగత్వము నొందఁ జేయు చిలఁ బాత్రుండాయెఁదా, "జోగి నీ
రోగీ కృత్యతి శౌండవైద్యుఁడితఁ" డన్ ప్రో చ్చైః ప్రజానూతికా
యోగక్షేందు సదాశివున్ సవిత సేయున్ దివ్యదారోగ్యుఁ గాన్.
"ధనమూలంబ యిదం జగం" బనఁగఁ జిత్తంబందు భావించియున్,

దన వైద్యాలయ రోగిచేత నుపదత్తం బర మింతంచు లె
క్కను జూడండు సదాశివుం, డిటులు నిక్కంబైన దాక్షిణ్యమున్
గనుటంగాదె తెలుంగు దేశమునఁ దాఁ గాంచెన్ జయాభ్యున్నతిన్.

ఇన్ని శరత్తు లిన్నగరి నింతనిరామయ భావసంప ద
భ్యున్నతి భాసమానుఁడయి, యొర్మిగ దార్త జనాళి కెల్ల వి
ద్వన్నుతి పాత్ర సేవ లెడఁ బాయ కెవండు చరించుచున్ గమిం
చెన్నుతవైద్యుఁడై యతఁడు చెందే సదాశివుఁ డాంధ్రమాన్యతన్.

ఇంక మరొక్క షష్టి యగు నేండ్లు నిరామయమూ ర్తివై, నిరా
తంకముగా గమించుచు, నుదాత్త సమస్త రుజార్త సేవ చే
నంకము లేని పేరు గనుచార్య ! సదాశివరాయ ! దేశ మం
దంకిలి రాజకీయముల నందక, యందుఁ బదోన్నతుండవౌ.

సరసుఁడు, సాహితీరతుఁడు, సాగర మేరుగభీర ధీరుఁ, డా
సురగుణ మించుకన్ గొనని శుద్ధగుణాత్ముఁడు, సాధు సత్కవీ
శ్వర సుకళా విదాదరణశాలి, సదాశివరావు సద్భిష
గ్వరుఁడు శతాధికాబ్దములు వాసి గమించుఁ బరోపకారియై,
సత్యము భూ శినంబు సరసం బతి సుందరమున్ సదాంధ్ర సం
స్తుత్యము నైన సాహితి కమోఘము పెంపు ఘటింపఁ బూని, సా
హిత్య మహాసదస్సు వెలయించి, తదర్థము నిర్వహించి, స
న్నుత్యము కీర్తిగాంచిన ఘనున్ గణుతించెద నిన్ సదాశివా !

బుధులకు సత్కవీంద్రులకు భూరి ముదంబుగ నాత్మసాహితీ
సదసునఁ దానొసంగి, నిజశక్తిని, వారల కార్థసాహ్య సం
పద నిడి, తగ్గుణార్జన సమంచిత మానస హంసమూర్తి వై
యదిర ! తదీయ కావ్యవిషయంబుఁగఁ జేసితి నీదుశీలమున్ .

వినుతకలా కలాపరసవేదులు నీ దగు 'సాహితీసద'
స్సును గని, శ్రోతలౌచు, రససుందర సత్కవి గద్యపద్యముల్
వినుచొగిఁ, దాము నీపురిని వేడుక నిట్టి సదంబు లెన్ని యో
తనరఁగఁ జేసినారు సముదార ముదావహ సాహితీరతీ !!

అకుటిల రాజకీయ గితివై, శ్రితలోకుల శాత్మశక్తి నూ
రక ఘటియింతు వెంతయుఁ బరంబు హితంబు సతంబుగానఁ బా
యక పెదకూరపాటి సుజనావళి నిన్నే వరించె నేతఁగా;

బ్రకటపు నీ వినీతియ ధరన్ జయమాయెను గాదె నీ కిటుల్.

వసు వురు వుంటగాదు, నిజవర్గపు మన్నన గంటగాదు, ధీ
నెసఁగుచు రాజకీయ విజయేందిరం గొంటయుఁ గాదు కారణం,
బసదృశ శీల ! నీ గుణగణార్జన మొండె నిదాన మారయన్
వసుధ గిరీశమూర్తికి భవద్గురుకీర్తి కహో సదాశివా॥

ఇందఱు వైద్యు, లిందరు కవీశ్వరు, లిందఱు వేదశాస్త్ర వే
దీందువు, లిందలపురి రహించు మహాజను, లిందఱౌ కళా
సింధువు లిట్టు లీ సభకుఁ జేరిరి నీ దగు షష్ఠి పూర్తి, కే
చందము చేత లోఁగొనితి స్వాంతము లిందఱివో సదాశివా !!

శివ దేహోపమదీప్ర కీర్తి ! విలసచ్ఛీలోదయో దీర్ఘమూ
ర్తి ! వి శేష స్తుత సత్కవీంద్ర కృతి సందీవ్యద్గుణస్ఫూర్తి ! దీ
ప్త వివేకాత్మ ! ప్రణీత దీన సుజన స్వాంతేష్ట సంపూర్తి ! నీ
కవు దీర్ఘాయు వహో సదాశివ! మహీయః కాంతిమూర్తీ ! మహిన్

– సుఖవాసి మల్లికార్జునరాయశాస్త్రి

## ప్రశంస!

ఎవ్వాని వైద్యనై పుణ్య మాదర్శమై బంగారు రంగారు భంగి యయ్యె
ఎవ్వాని సద్గుణహృది తేట తెల్గుల మల్లెలందలి వెల్గు మాడ్కి యయ్యె
ఎవ్వాని సాహితీవృత్యాభిమానమ్ము కస్తూరి సద్గంథ కరణియయ్యె
ఎవ్వాని వర్తన మిద్ధమానసులకు జలదతటిల్లతా సరణి యయ్యె

అట్టి 'కాసర నేని' వంశాబ్ధివిధుఁడు
యద్భుతాద్భుతకీర్తి సమంచితుండు
రాజితుండు, 'సదాశివరాయ' ఘనుఁడు
తెలుఁగు దల్లికిఁ గలిగిన లలితసుతుఁడు.

తెలపఁడు, నన్యదూషణ ముదాత్త మహత్తర చిత్తుఁ డౌటచే –
నిలుపఁడు, దుర్మతంబమిత నిర్మల ధర్మమనస్కుఁ డౌటచే
పలుకఁడు వ్యర్థ భాషణ మపార కృపాపర తంత్రుఁ డౌటచే
గలుగఁడు దోషకృత్యములఁ 'కాసర నేని' మనీషి యెయ్యెడల్ .

చెప్పదు కాని పల్కులను, చెప్పక సత్కృతు లాచరించుటన్
తప్పదు చేయుకృత్యములఁ జెప్పిన నొప్పుగ మెప్పులొందుటన్
ఒప్పదు చేయరాని పనికొప్ప పరిస్థితు లెన్నో కుప్పఁగా
కప్పఁడు దుర్యశంబిలని **'కాసరనేని'** మనీషి యెయ్యెడల్

అనుపమ సద్గుణాంచిత మహాహృదయాన్విత వర్తన ప్రధా
జనిత యశోనిదానయుత సత్కవి సన్నుత చిత్త సంయుతా
వినయ విశేష భావపరివేష్టిత భూరి రసజ్ఞ వారస
ద్ఘనయుత దివ్య భాగ్య ఖని కాసరనేని మనీషి యెయ్యెడల్,

కృతకృత్యంబయి, దివ్యభవ్యయుతమై, కీర్తింపఁగా నర్హమై
శ్రిత వాత్సల్య సమేతమై, విపుల రాశీభూత కారుణ్య స
న్మత సంవేతమునై, తనర్చి భవ, మిందాఁకన్ విరాజిల్లె సం
తత మింకన్ ద్విగుణీకృతం బగుతనే తద్భావ సంపన్నతల్ .

– యం. వి. ఆర్. కృష్ణ శర్మ

## భిషగ్వరా!

శ్రీ రమణీ మనోహరుడు చిన్మయరూపుడు వేద విద్య సొం
పారుచు భక్తి మీరు హృదయాంబుధు లందున తేలియాడు వి
స్ఫార మనోజ్ఞమూర్తి రసబంధుర భావుడు రాజకీయ గా
ధా రమణీయు డాక్టరు సదాశివరావును బ్రోచుగావుతన్ .

సహజ సువైద్య తత్వ పరిషక్తుడ వీవు కళామయీ ముహు
ర్ముహురను భావముల్ ప్రమదముల్ కలిగించిన నా
యెడందలో అహరహమున్ స్రవించు నమృతామృత గాంగతరంగడోలికా
నిహ తమరుత్ప్రసారములు నిన్ను దలంచినచో భిషగ్వరా !

షష్టిపూర్తి యయ్యె సరసోత్సవం బయ్యె
కనులలోన కాంతి కళలు వెలిగె
కళలలోని క్రాంతి కళిక లానందించి
వేయియేండ్లు మనుము విమలచరిత!

– డాక్టర్ యం. పాండురంగారావు, ఆంధ్రోపన్యాసకుడు

# ప్రశ్నోత్తరం

ఆంధ్ర జాతీయ బి. ఇడి. కళాశాల, మచిలీపట్టణము.

చైతన్య విద్యున్నిధులతో వెలుగుతున్న
భూమి అడిగింది నన్ను – నిండుకుండలా తొణకని వాడెవడని ?

ఎండిన చేల నోళ్ళల్లోకి అమృతం పోస్తున్న
మేఘం అడిగింది నన్ను. – బాధిత జన బాంధవు డెవడని ?

రాగ ద్వేషాలకు అతీతంగా ప్రకాశిస్తున్న
అగ్ని అడిగింది నన్ను – నిప్పులాంటి మానవుడెవడని!

అపుడే వికసించిన మల్లెల నుండి వస్తున్న
గాలి అడిగింది నన్ను – అభిమాన స్వేచ్ఛాఘను డెవడని ?

అన్ని దిక్కుల తలలు నిమిరి ఆశీర్వదిస్తున్న
ఆకాశం అడిగింది నన్ను – విశాల హృదయం కలవాడెవడని ?

పంచ భూతాలకు నా సమాధానం –
"కాసరనేని సదాశివరావు".

- డా. రావి రంగారావు, తెలుగు భాషోపన్యాసకులు

# జాతిరత్నము

బిగురు బీరమున్న పెద్ద సంపిక చేసి నీడటంచు తెలుగునాడు పిలుచు
కాలనుందు గలకు కాపరనీకు మీ నింక మెపుడు నన్నెవాసిగలదె.

కల్లకపటు లేని పిల్లరాయ వటంచు బుద్ధిరాజువారు పొంగిపోయి
సానబట్టినారు జాతిరత్నమ్ముగా తరిగిపోకు నాటి గఘకు తళుకుబెళుకు.

భాషపైని మోజు భావమ్ముపై తేజ తగ్గుతున్నదంచు తపనజెంచు
దేశికులకు సాహితీపద స్వెంకటి యండియయ్యె పసిడికొండడియయ్యె

వీటలు నొక్కగానే దొర బిక్షలు మంచు దలంచువారి ము
పూటలు రెండు చేతులను ముల్లెలు మూటలు గట్టువారి మై
తాటలు తీయగావలె. సదాశివరాయ ! సదాశివమ్ముగా
కూటికి గుడ్డకున్ నిలుచు గూటికి శక్తిని చెందుజాతికిన్,

మహీతాను మోదమా సహితాను రూప ఫలితాను భావమా పధముబట్టి
కలితానురాగమా సపతానుకూలమా సమతానుసరణమా సరళివెంటి అగి
స్థిర తానుయు క్తమా త్వరితాను గమనమా జనతానుకంపమా జాడలరసి
క్షమతానువిద్ధమా శమితానుబద్ధమా అబుతాను శోధమా క్రమము దలచి

నడత సవరించుకొనెడి మానవుల ప్రాయ
మరువ దేండ్ల యిన జారదీ యవనియందు
"కుచ్చితము లేనివారలే" కుఱ్ఱవాండ్రు
మురికి భావాలు గలవారె ముసలివారు.

కూతకు వ్రాతకు చేతకు
చేతమునకు పొత్తుగల విశిష్ట గుణాన్యుల్
జాతికి – భ్రాతలు గుణ సం
ధాతలు త్రాతలు శుభప్రదాతలు నేకల్.

– శ్రీ బొద్దులూరు నారాయణరావు

శ్రీయుతులు డాక్టర్ కాసరనేని సదాశివరావుగారి
షష్టిపూర్తి సందర్భమున సన్మానసంఘము సమర్పించు

**సన్మానపద్య ప్రసూనాంజలి** – శ్రీ చిన్నము రామయ్య చౌదరి

నీకై తెచ్చితిమయ్య ! మా మధుర హృన్నీ రేజ పత్రోజ్జ్వల
చ్ఛీశాన్యమ్ముల నొల్కబోసిన రసశ్రీభాండముల్, సాహితీ
లోకారాధ్య కవిత్వ సుందర లతా లూన ప్రసూనాంజలుల్
సాకూతమ్ములు, భావబంధుర కళా సంస్కార సౌరభ్యముల్.

తన కర్తవ్యము నిర్వహించుట మహాధర్మంబుగా, దైవ భా
వనగా నెంచెడి మంచిమానిసిగ, విద్వన్మూర్తు లెవ్వారు వ
చ్చిన పూజించు కళాపిపాసువుగ, సౌశీల్యంపు కాణాచిగా,
జనముల్ చెప్పుచునుండ్రు నిన్నొక విశిష్టవ్యక్తియౌ వెజ్జుగా

ఆదర్శ వైద్య విద్యానిధి యందుమా ?
సాహితీసేన ప్రశ్నముగ మిగులు,
సాహితీ ప్రియుడని సన్మాన మిడుదుమా ?
భావుకత్వము సహపంక్తి గోరు
భావుకాగ్రణిగ సంభావింతు మంటిమా,
సౌహార్ధ్యమునకు నాసనము లేదు,
మంచి రసజ్ఞుగా నెంచి పూజింతుమా,
రాజకీయపు సాగరమ్ము లెగయు

ధర్మచింతన, సాహితీ తత్వచింత
కల వివేకిన సదృశః కలితు దగుచు
షష్టిపూర్తిని గన్న సౌజన్య మూర్తి
మాత్రమే మాకు సన్మాన పత్రమిపుడు.

ఒక కవితో, వితీర్ధ ఖనికో, గురుదేవునకో, మహర్షికో
సకలకళా ప్రపూర్ణ గుణ సాగర సారమనీషి కోటికో
అకలుష కీర్తి నందగ దశాబ్దులు పట్టును, రాజకీయ నా
యకుల కొకింతలోనె యశమబ్బును వింతగ పాలపొంగుగా.

ఈ వే శాసనసభ్యుడైతే వని యేవేన్ స్తోత్రపాఠమ్ము లి
ట్టే వల్లింపగ రాము, మీ విభుత మాదేయన్న భావమ్మ దే
దో, వైహాయస వీధులం బరువు లెత్తున్ రెక్కల న్విప్పి, ఆ
యావేశమ్మటు రూపమెత్తినది గీతాకల్పనా శిల్పమై.

కలుషిత రాజకీయములు కశ్మలముల్ కడుగంగ వానయై
అలరెడి వాగునై, వఱదయై, మఱి యేఱును నౌచు, కాలువల్
మలచుచు బానిత్వద్గుణ సుమమ్ముల సారము తెల్గునేల సొం
పలర ఫలింపగా నడపుమయ్య ; సదాశివ రాజకీయముల్ .

అరుదగు సత్యధర్మముల కాయువు పోయు మనః ప్రవృత్తి, ని
ష్ఠురతర దుష్టచింతనల సోకుడు లేని దయార్ద్ర బుద్ధి, దు
స్తర కలుష ప్రవృత్తులకు తావు నొసంగని చిత్తశుద్ధి, వి
స్తరముగ నిస్వరించెను సదాశివరాయ ! శుభమ్ము నీ కగున్.

## సదాశివాష్టకము

కాసరనేని లేక కుబేరులున్న
రాసులఁ గుప్పించురా సదా శివుఁడు,

సతము జయప్రద శక్తితో నున్న
సతమత మగుచుండు జనముల తోడ

శ్వేత దేహమ్ముతోఁ జెన్నారియున్న
వా తెరలు బిగించు పంతాన నలుపు

భక్త వాత్సల్యంపు పంటవై యున్న
శక్తితోఁ జెయిపెట్టు భక్తులే తలను.

సర్వేశుఁడను పేరు సత్యమై యున్న
ఉర్విఁ బశుపతిగా నున్ననే కుదురు.

లోక రక్షా దీక్ష లోలోన నున్న
రాకాసి మూకలు ప్రార్థింత్రు నిన్ను.

మూఁడవ నేత్ర మమోఘమై యున్న
వేఁడిఁ దా రేశుడు వెంటనే యార్పు.

వ్యాజస్తుతుల కేమి వంకల కేమి
తేజమ్ముతో నిండి దీవింపు మమ్ము.

– డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ, కళాశాల ఆంధ్రోపన్యాసకుడు

## త్రీచీర్స్ – నాగభైరవ కోటేశ్వరరావు

ఇతరులు కుట్రచేయు సభము
నిదిరించిన ప్రభాకరుడు
సిరులు కొలువు ఒకే
స్నేహ్రగంథమున్న వరుడు

ఉర్వియంతో ఏడారిలో
ఉదయించిన ఒయాసిస్సు
కవులన్నా కళలన్నా
కౌగిలించు శుభాశీస్సు

'గర్త పురీ' నగరానికి
వర్తమాన ఆభరణం
దీపించే మంచివైపు
వ్యాపించే నవకిరణం

మడిచేతులు కట్టు నుతల
మాసిన దర్పమ్ము లచట
మొక్కల పోలిక శిరములు
నిక్కించును ప్రతిభ లచట

వాసంతి సమీరంలా
భాసించెడి డెందమందు
అచ్చమైన ఆదర్శపు
సౌగంధం మేటి విందు

అతడు సదాశివుడు – యిపుడు
షష్టిపూర్తి యైన వరుడు
ఏ బిరుదులు తూచలేని
జనసేవా దురంధరుడు.

## దేశికోత్తముడు (రజతోత్సవ సంచిక నుండి)

శ్రీ జీవని కధినాథుడు
పూజితుడు; సదాశివాఖ్య – పూర్ణాయువుగా
భూజన, వ్యాధినివారణ
భాజనుడగు, వరములొసగి భవుడోము సదా

ధరణి తెనుంగు దేశమున, తాము గడించిన వైద్య విద్యలో
మెరుగులు దిద్దుకోదలచి, మీ సముఖంబున కేగు దెంచి, సో
దరసమభావ ముంచి, నిరతంబు శ్రమించిన క్రొత్త డాక్టరుల్
బిరుదము లంది లోకమున పేరుగడింపరె వందలాదిగన్–

వచ్చిన వారి కెల్ల రకు వైద్య మొనర్చి సుఖంబు గూర్చి, వా
రిచ్చిన రొక్క మిబ్బడిగా నిచ్చితి రంచు వచించి కొంత యీ
వచ్చిన మెచ్చి పుచ్చుకొని, వారె సెబాసని మానసమ్ములో
నచ్చెరు వంది మెత్తురట! ఔర! సదాశివరావు నీవికిన్.

– కీ॥ శే॥ చలసాని లక్ష్మినారాయణవర్మ

## సన్మిత్రులు

కదలాడు నెవ్వాని హృదయాంతరాళాన శారదా మంజీర చరణ రవళి
వర్ధిల్లు నెవ్వాని వాక్సుధా పూరాన హర్షణోత్కర్ష కల్హారపాళి
ప్రభవించు నెవ్వాని భావ నీరంధ్రాన సారసంస్కార నీహారవారి చె
ర్లాడు నెవ్వాని చిత్త ప్రసూనాన సాహితీ సౌహార్ద సౌరధార

అతఁడు సామాన్యుఁడా ! యేమి ? యావదాంధ్ర
దేశ దేశిక ప్రవర విధేయుఁడైన
సదాశివరావు సుస్థిర యశ్శుడు
శ్రీమతి జయప్రదాదేవి నోముపంట

-శ్రీ బొడ్డులూరు నారాయణరావు(రాధేయుడు)